## 1. ఆదిత్య

**A.**
1. సూర్యాష్టకం
2. ప్రవచనం
3. సూర్యనారాయణ -తిమిరహరణ
4. సూర్యోపాసన
5. భజన
6. సూర్యగాయత్రి

**B.**
1. ఆదిత్య హృదయం
2. మృత్యుంజయ మంత్రము
3. శాంతి మంత్రములు

## 2. సోమేశ్వరం

**A.**
1. శివప్రాత: స్మరణమ్
2. గణేశ ద్వాదశ నామావళి:
3. విశ్వనాథాష్టకం
4. ప్రవచనం
5. అద్వైతామృత (పాట)
6. శివ గాయత్రి

**B.**
1. శివాష్టోత్తర శత నామావళి:
2. గిరిజా రమణ (భజన)
3. మృత్యుంజయ మంత్రము
4. శాంతి మంత్రములు

## 3. మంగళమారుతి

**A.**
1. హనుమత్ప్రాత: స్మరణం
2. హనుమత్ప్రార్థన
3. వందన మందుకో (పాట)
4. హనుమ గాయత్రి
5. ప్రవచనం
6. హనుమ ద్వందనం

**B.**
1. వాతాత్మజ హనుమాన్ (భజన)
2. ఆంజనేయ అష్టోత్తర శత నామావళి:
3. రామలక్ష్మణ జానకి (భజన)
4. మృత్యుంజయ మంత్రము
5. శాంతి మంత్రములు

## 4. బుద్ధం

**A.**
1. ప్రాత: స్మరణ స్తోత్రమ్
2. విజ్ఞాన నౌక
3. ప్రవచనం
4. కశ్చిత్ అస్తి అపారశక్తి: (పాట)

**B.**
1. బ్రహ్మ జ్ఞానావళీమాల
2. మాధవ గిరిధర (భజన)
3. బ్రహ్మ గాయత్రి
4. మృత్యుంజయ మంత్రము
5. శాంతి మంత్రములు

## 5. గురుసన్నిధి

**A.**
1. సద్గురు ప్రాత: స్మరణమ్
2. గురు స్తోత్రం
3. పరమ మంగళ (భజన)
4. గురుగాయత్రి
5. ప్రవచనం
6. గురుప్రార్థన

**B.**
1. గుర్వష్టోత్తర శత నామావళి:
2. కరుణామయదేవా!(పాట)
3. సద్గురు వందనం
4. మృత్యుంజయ మంత్రము
5. శాంతి మంత్రములు

## 6. శక్తి

**A.**
1. దేవీ ప్రాత: స్మరణమ్
2. భవభయ నాశిని (పాట)
3. దేవీ గాయత్రి
4. శ్రీ లక్ష్మ్యష్టకమ్
5. జయకరి (భజన)

**B.**
1. దుర్గా అష్టోత్తర శత నామావళి:
2. ప్రవచనం
3. శ్రీ శారదాష్టకం
4. మృత్యుంజయ మంత్రము
5. శాంతి మంత్రములు

## 7. శనిలో మణి

**A.**
1. ప్రాత: స్మరణం
2. మేలుకొలుపులు
3. గాయత్రీ మంత్రములు

**B.**
1. శ్రీ కృష్ణాష్టకం
2. శ్రీకృష్ణ అష్టోత్తర శత నామావళి:
3. ప్రవచనం
4. కృష్ణా ముకుందా హరే (భజన)
5. మృత్యుంజయ మంత్రము
6. శాంతి మంత్రములు



ప్రాప్తిస్థానము :
సుందర చైతన్యాశ్రమం
దుండిగల్‌రోడ్, హైదరాబాద్-500 043










































## 1. ఆదిత్య

**A.**

1. సూర్యాష్టకమ్
2. ప్రవచనం
3. సూర్యనారాయణ-తిమిరహరణ
4. సూర్యోపాసన
5. భజన
6. సూర్యగాయత్రి

**B.**

1. ఆదిత్య హృదయం
2. మృత్యుంజయ మంత్రము
3. శాంతి మంత్రములు



SUNDARA CHAITANYA ASHRAM - HYDERABAD - 500 043






గానం : సంగీతం
స్వామి సుందర చైతన్యానంద

## 4. బుద్ధం

**A.**

1. ప్రాత: స్మరణ స్తోత్రమ్
2. విజ్ఞాన నౌక
3. ప్రవచనం
4. కశ్చిత్ అస్తి అపారశక్తి: (పాట)

**B.**

1. బ్రహ్మ జ్ఞానావళీమాల
2. మాధవ గిరిధర (భజన)
3. బ్రహ్మ గాయత్రి
4. మృత్యుంజయ మంత్రము
5. శాంతి మంత్రములు






గానం : సంగీతం
స్వామి సుందర చైతన్యానంద

## 5. గురుసన్నిధి

**A.**

1. సద్గురు ప్రాత: స్మరణమ్
2. గురు స్తోత్రం
3. పరమ మంగళ (భజన)
4. గురుగాయత్రి
5. ప్రవచనం
6. గురుప్రార్థన

**B.**

1. గుర్వష్టోత్తర శత నామావళి:
2. కరుణామయదేవా!(పాట)
3. సద్గురు వందనం
4. మృత్యుంజయ మంత్రము
5. శాంతి మంత్రములు

SUNDARA CHAITANYA ASHRAM - HYDERABAD - 500 043

# మంగళమారుతి





గానం : సంగీతం

స్వామి సుందర చైతన్యానంద

SUNDARA CHAITANYA ASHRAM - HYDERABAD - 500 043

## 3. మంగళమారుతి

**A.**

1. హనుమత్ప్రాత: స్మరణం
2. హనుమత్ప్రార్థన
3. వందన మందుకో (పాట)
4. హనుమ గాయత్రి
5. ప్రవచనం
6. హనుమ ద్వందనం

**B.**

1. వాతాత్మజ హనుమాన్ (భజన)
2. ఆంజనేయ అష్టోత్తర శత నామావళి:
3. రామలక్ష్మణ జానకి (భజన)
4. మృత్యుంజయ మంత్రము
5. శాంతి మంత్రములు

SUNDARA CHAITANYA ASHRAM - HYDERABAD - 500 043

# శక్తి





గానం : సంగీతం

స్వామి సుందర చైతన్యానంద

## 6. శక్తి

**A.**

1. దేవీ ప్రాత: స్మరణమ్
2. భవభయ నాశిని (పాట)
3. దేవీ గాయత్రి
4. శ్రీ లక్ష్మ్యష్టకమ్
5. జయకరి (భజన)

**B.**

1. దుర్గా అష్టోత్తర శత నామావళి:
2. ప్రవచనం
3. శ్రీ శారదాష్టకం
4. మృత్యుంజయ మంత్రము
5. శాంతి మంత్రములు

SUNDARA CHAITANYA ASHRAM - HYDERABAD - 500 043

# శనిలో మణి





గానం : సంగీతం

స్వామి సుందర చైతన్యానంద

## 7. శనిలో మణి

**A.**

1. ప్రాత: స్మరణం
2. మేలుకొలుపులు
3. గాయత్రీ మంత్రములు

**B.**

1. శ్రీ కృష్ణాష్టకం
2. శ్రీకృష్ణ అష్టోత్తర శత నామావళి:
3. ప్రవచనం
4. కృష్ణా ముకుందా హరే (భజన)
5. మృత్యుంజయ మంత్రము
6. శాంతి మంత్రములు

SUNDARA CHAITANYA ASHRAM - HYDERABAD - 500 043

# సోమేశ్వరం





గానం : సంగీతం

స్వామి సుందర చైతన్యానంద

## 2. సోమేశ్వరం

**A.**

1. శివప్రాతః స్మరణమ్
2. గణేశ ద్వాదశ నామావళి:
3. విశ్వనాథాష్టకం
4. ప్రవచనం
5. అద్వైతామృత (పాట)
6. శివ గాయత్రి

**B.**

1. శివాష్టోత్తర శత నామావళి:
2. గిరిజా రమణ (భజన)
3. మృత్యుంజయ మంత్రము
4. శాంతి మంత్రములు



# నిత్యమంగళమ్



# నిత్యమంగళమ్




జ్ఞానబ్రహ్మ, ఆర్షవిద్యావాచస్పతి

శ్రీశ్రీశ్రీ స్వామి సుందర చైతన్యానంద





వివరములకు

**సుందర చైతన్యాశ్రమం**

దుండిగల్ రోడ్, హైదరాబాద్-500 043, ☎:3093999

ముద్రణ : శ్రీ లక్ష్మీ గణపతి బైండింగ్ వర్క్సు, కొవ్వూరు. ☎ : 31575

## నిత్యార్చన

ఎన్నో మంచి మంచి ఆలోచనలతో, అలవాట్లతో ఒక మంచి జీవితం తయారవుతుంది. ఏ ఒక్క మ ంచి గాడిలోను ఒదిగి నడవలేని బ్రతుకు తెగిన గాలిపట మవుతుందంటే అతిశయోక్తి కాదేమో!

ఒక నాడు,

మొదటి మాటకు భారతదేశం ఒక నమూనా.

రెండవ పలుకుకు పాశ్చాత్యదేశాలు కార్ఖానా.

4

నేటికీ

రెండవ జాతిలో మార్పు ఏదీ లేదు.

మొదటి జాతి చాలా పెద్దగా మారిపోయింది.

చావుదెబ్బ తిని చతికిలబడింది.

కారణాలను అన్వేషించే వృథా ప్రయాసకు ఇది సమయంకాదు.

సరిచేసే ప్రయత్న మొక్కటే సరిఅయినది.

దీపం వెలిగించే కార్యమే సిరులొలికిస్తుంది.

పువ్వు పుట్టగానే పరిమళం.

ఉదయ భానునితో ప్రకాశం.

5

పునాదిపై ఆధారపడి  భవనం శోభిస్తుంది.
ఉషః కాలంపై ఆధారపడి బ్రతుకు భాసిస్తుంది.

మనసంస్కృతిలో, పూర్వం
ప్రతి ఉషోదయం ఒక కళ్యాణ సందడి.
ప్రతి పరిసరం పచ్చతోరణాల అంగడి.

అరుణోదయానికి ముందు నిద్రలేవటం
సర్-సర్ మంటూ ఇళ్ళు చిమ్ముతున్న చప్పళ్ళు
తాటాకు చప్పళ్ళలా కళ్ళాపి శబ్దాలు

6

బావి గిలకల గలగలలు
రంగవల్లులు తీర్చే పడచులు
అంబా అంటూ గోత్సములు
అచ్యుతా అంటూ హరిదాసులు
తులసిమాతకు ప్రదక్షిణ చేసే సుమంగళులు
నదీ స్నాన మాచరించి దర్భలు చేతబట్టుకొని ఇంటికి వస్తున్న
యజమానులు
--ఇలా నెమరువేసుకుంటూ ఉంటే
చిన్ననాడు మనము చూచినవే అయినా,
అవి నిజమేనా! అని ఆలోచన కలగక పోదు నేడు.

7

కాలమార్పుల్ని అంగీకరించకపోవడం ఒక దౌర్బల్యం.
అలాగని, కాంతుల్ని ఆవిష్కరించుకొనే ప్రయత్నం చేయకపోవడం దురదృష్టం.
మంచి అలవాట్లతో
ఆచారాలతో
ఆలోచనలతో
ఉదయాలను ఆనందంగా  గడపలేని మానవుల అశక్తతే ఈరోజు సమాజంలో సాగుతున్న దమనకాండకు ఊపునిచ్చింది,ఊతనిచ్చింది.
ఊపిరిపోసింది.

చెడిపోయింది అనిగొంతు చించుకునేవారే అందరు.
చెడగొట్టింది ఎవరని ఆలోచించగలిగే వారెందరు?

8

చెడినకార్యంలో తమ వంతు ఉందో లేదో పరిశీలించేవా రెందరు?
పని కట్టుకొని పరీక్షించి సరిదిద్దు కొనేవా రెందరు?
ఈ  జనాభాలెక్కలు నాకెందుకు పద్మనాభా!

ఋషుల పాదాలు పడిన నేలపై పారాడిన పుణ్యం నాది.
సత్సంప్రదాయాలతో పెద్దల అడుగులలో పెరిగిన భాగ్యం నాది.

దుర్భర బాధల వలయాలను ఛేదించుకుంటూ
అభిమన్యుని పోరాట పటిమతో బోధలు పంచిన జీవితం నాది.
ఎందరో సంస్కారుల హృదయాలలో
నిర్మల భక్తిని, వేదాంత స్ఫూర్తిని నింపిన బ్రతుకు నాది.

మరెందరో -- గాడి తప్పిన వారిని
నాడి తెలిసి నడిపించిన ప్రచార ప్రభంజనం నాది.

అదే బాటలో
ఓనాటి వైభవాన్ని పునః ఆవిష్కరించే పవిత్ర కార్యంలో
ఇదొక మేలుకొలుపు.
మేలైన మంచి మలుపు.

ప్రతి ఉషోదయాన్ని మంగళ ప్రదంగా ఉంచేందుకు పిలుపు,
ఎదురయ్యే దోషాలపై ఇది సునాయాసంగా సాధించే గెలుపు
అని భావించి



సేకరించి
రచించి
స్వరపరచి
గొంతు తెరిచి -----చేసిన కృషినంతా
ఏడు ఆడియో క్యాసెట్లలో దాచి
అందరిలోని నీకు
ఆర్ద్రతతో, ఆనందంతో
అర్పించుకొంటున్నాను.
సద్భక్తితో సమర్పించుకొంటున్నాను.

11

## భగవంతా! నీదే అంతా!

శోకాల జీవులకు నీవు చల్లని నీడ!
శాపాల బ్రతుకులకు నీవు వెన్నెలవాడ!
కారు మబ్బులలోన కాంతిరేఖవు దేవా!
శ్వాసల ఉయ్యాలలో ఊగే వాసుదేవా!

ముందున్న మృత్యువును చూడలేని మేము
లోనున్న నిన్ను చూచేదెలాగు?
లోన నీవున్నావు

12

ప్రతిమలోన నీవున్నావు
ప్రతి ఇంటిలో నీవు పలకాలని
నీ పలుకుతో కళ్ళు విప్పాలని
అర్పించితిని మనసు మాటలలో మడచి
ఏడుపును బాపుటకు ఏడు సోపానాలు
నా గుండె గుసగుసలు నీకు నా మేడలు
నా గొంతు పలుకులు నీకు నైవేద్యాలు
నా రాతలు నీ అడుగులకు పువ్వులు
నా శ్వాసలే నీకు నీరాజనాలు

విశ్వమంతా ఆమనిగా వెలిగిపోనీ!
ప్రతి మనిషీ ఓ మునిగా తెలిసిరానీ!
ఆ దివ్యక్షణము
ఆ పుణ్యకాలము
చూచే రోజు రానీ!
నీ చరణాలలో మమ్ము దాగిపోనీ!
నిత్యమంగళమై జగతి సాగిపోనీ!

ఓం శ్రీకృష్ణ చరణారవిందార్పణమస్తు

స్వామి సుందర చైతన్యానంద



# సూర్యాష్టకమ్

ఆదిదేవ నమస్తుభ్యం ప్రసీద మమ భాస్కర ।
దివాకర నమస్తుభ్యం ప్రభాకర నమోస్తుతే ॥ 1

సప్తాశ్వరథమారూఢం ప్రచండం కశ్యపాత్మజం ।
శ్వేతపద్మ ధరందేవం తం సూర్యం ప్రణమామ్యహం ॥ 2

లోహితం రథమారూఢం సర్వలోక పితామహం ।
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహం ॥ 3

త్రైగుణ్యంచ మహాశూరం బ్రహ్మావిష్ణు మహేశ్వరం ।
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహం ॥ 4



బృంహితం తేజసాం పుంజం వాయుమాకాశమేవచ ।
ప్రభుంచ సర్వలోకానాం తం సూర్యం ప్రణమామ్యహమ్ ॥ 5

బంధూక పుష్ప సంకాశం హారకుండల భూషితం ।
ఏకచక్రధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్ ॥ 6

విశ్వేశం విశ్వకర్తారం మహాతేజః ప్రదీపనం ।
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్ ॥ 7

శ్రీవిష్ణుం జగతాం నాథం జ్ఞానవిజ్ఞాన మోక్షదం ।
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్ ॥ 8

సూర్యాష్టకం పఠేన్నిత్యం గ్రహపీడా ప్రణాశనం ।
అపుత్రో లభతే పుత్రం దరిద్రో ధనవాన్ భవేత్ ॥ 9

ఆమిషం మధుపానంచ యః కరోతి రవేర్దినే ।
సప్తజన్మ భవేద్రోగీ జన్మజన్మ దరిద్రతా ॥ 10

స్త్రీతైల మధుమాంసాని యస్త్యజేత్తు రవేర్దినే ।
నవ్యాధి శోక దారిద్ర్యం సూర్యలోకం స గచ్ఛతి ॥ 11

ఇతి శ్రీ శివప్రోక్తం సూర్యాష్టకమ్ సంపూర్ణమ్



## ప్రవచనం

**దీపం సర్వ తమోపహం** - సమస్త చీకటిని పోగొట్టేది దీపం. చీకట్లో మనము సాధించేదంటూ ఏదీ ఉండదు. ఏది సాధించినా వెలుతురులోనే. కనుకనే,

**దీపేన సాధ్యతే సర్వం సంధ్యా దీప నమోస్తుతే**

అని సాయం సంధ్యా సమయాన దీపాన్ని వెలిగించి నమస్కరిస్తాము. సాయంత్రాలలో ఎవరి గృహాలలో వాళ్ళు దీపాలను వెలిగించుకుంటాం. కాని ఉదయ సమయాన, విశాలమైన చీకటి విశ్వంలో పరమాత్మ సూర్యదీపాన్ని వెలిగిస్తున్నాడు.

అందరి కొరకు పరమాత్మ చేసిన ఈ పవిత్ర యజ్ఞకార్యక్రమాన్ని తిలకించి, మేను పులకించి, మనస్సు పరవశించి, చేతులు జోడించి సూర్యునికి నమస్కరిస్తున్నాము. ఇదే సూర్యోపాసన. అనాదిగా ఈ పవిత్ర భారతావనిలో సాగుతున్న నిత్యదేవతారాధన.

సర్వాంతర్యామి యైన పరమాత్మను మనం వీక్షించలేము. ఆయన దివ్య విభూతులను వీక్షించటమంటే పరమాత్మ వైభవాన్ని దర్శించటమే. ఇది సుస్పష్టంగా సూర్యుని ఆరాధించుటలో గోచరమవుతుంది. కనుకనే,

**సూర్యః ప్రత్యక్షదేవతా** - సూర్యుని ప్రత్యక్షదైవంగా కీర్తించారు. సూర్యుడు కేవలం వెలుతురును, వేడిని ఇచ్చే అగ్నిగోళం కాదు. జీవనాన్ని ప్రసాదించే అమృతభాండము.



వెలుగు, వేడి అనేవి విద్యుత్తునుండి కూడా లభిస్తాయి. జీవశక్తి సూర్యుని నుండే లభిస్తుంది.

భూమినుండి ఆహారము, నీరు లభిస్తే, సూర్యుని నుండి జీవశక్తి లభిస్తున్నది. భూమి కూడా సూర్యకుటుంబము లోనిదే.

ఆ సూర్యుని లోని శక్తి పరమాత్మయే. ప్రకాశం లేకపోతే సూర్యుడు లేడు. రవి లేనిచో చంద్రుడు లేడు. భూమిలేదు. ఏ శక్తి ఉండుటచేత సూర్యుడు సూర్యుడుగా ఉన్నాడో, ఏ సూర్యుడు ఉండుటచేత చంద్రుడు చంద్రుడుగా, భూమి భూమిగా మిగిలియున్నవో - అట్టి దివ్యప్రకాశము తానేనని శ్రీకృష్ణ పరమాత్మ గీత - విభూతి యోగంలో తెలిపారు.

**ఆదిత్యానాం అహం విష్ణుః జ్యోతిషాం రవిః అంశుమాన్**

ద్వాదశాదిత్యులలో తాను విష్ణువట. వెలిగేవాటిలో తాను రవియట.

కనుక సృష్టి స్థితిలయాలు పరమాత్మ కార్యాలైతే స్థితికి ప్రధానంగా గోచరిస్తున్న సూర్యభగవానుడు పరమాత్మ ప్రతిరూపంగా, ప్రతిమగా పూజ లందుకుంటున్నాడు.

పరమాత్మ దివ్యవిభూతులను ప్రదర్శించే పవిత్ర రూపాలలో అదితి పుత్రుడైన సూర్యదేవుడు ఆదియై ఆదిత్యుడని పిలువబడి, వారం ప్రారంభమైన ఆదివారము నాడు మన అర్చన లందుకొంటున్నాడు.

తిమిరహరుడు, ప్రత్యక్ష భగవానుడు అయిన సూర్యదేవుని మనమూ అర్చించి తరించెదముగాక!






పల్లవి :- సూర్యనారాయణ - తిమిర హరణ
ఉద్ధర మాం దేవ - దీన శరణ్య ॥సూర్య॥

చరణములు :-

1. ప్రత్యక్షదేవా! పాపసంహార!
జ్యోతి స్వరూప! సర్వలోక స్వామి! ॥సూర్య॥

2. నమో భూతనాథ! నమో దివ్యతేజ
నమో సుప్రకాశ! మహాపాపనాశ ॥సూర్య॥

3. సర్వ భూతపతిం - అప్రమేయ తేజం
లోక నివాసినం - స్మరామి లోకనాథం ॥సూర్య॥

4. పావన చరిత - పాపవిదార!
నమో భక్తపాల - చైతన్యలోల! ॥సూర్య॥

## సూర్యోపాసన

1. ఓం హ్రాం మిత్రాయ నమః
2. ఓం హ్రీం రవయే నమః
3. ఓం హ్రూం సూర్యాయ నమః
4. ఓం హ్రైం భానవే నమః
5. ఓం హ్రౌం ఖగాయ నమః
6. ఓం హ్రః పూష్ణే నమః



7. ఓం హ్రాం హిరణ్యగర్భాయ నమః
8. ఓం హ్రీం మరీచయే నమః
9. ఓం హ్రూం ఆదిత్యాయ నమః
10. ఓం హ్రైం సవిత్రే నమః
11. ఓం హ్రీం అర్కాయ నమః
12. ఓం హ్రః భాస్కరాయ నమః
13. ఓం హ్రాం హ్రీం మిత్రరవిభ్యాం నమః
14. ఓం హ్రూం హ్రైం సూర్య భానుభ్యాం నమః
15. ఓం హ్రౌం హ్రః ఖగపూషభ్యాం నమః
16. ఓం హ్రాం హ్రీం హిరణ్యగర్భ మరీచిభ్యాం నమః
17. ఓం హ్రూం హ్రైం ఆదిత్య సవితృభ్యాం నమః
18. ఓం హ్రౌం హ్రః అర్క భాస్కరాభ్యాం నమః
19. ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం మిత్ర రవి సూర్యభానుభ్యో నమః

20. ఓం హ్రౌం హ్రః హ్రాం హ్రీం ఖగ పూష హిరణ్య గర్భ మరీచిభ్యో నమః
21 ఓం హ్రూం హ్రైం హ్రౌం హ్రః ఆదిత్య సవిత్రర్క, భాస్కరేభ్యో నమః
22. ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః
ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః మిత్ర రవిసూర్య భాను ఖగ పూష హిరణ్యగర్భ మరీచ్యాదిత్య సవిత్రర్క, భాస్కరేభ్యో నమః
25. ఓం సవిత్రే సూర్యనారాయణాయ నమః

ఓం.... సూర్యాద్వైఖల్విమాని భూతాని జాయన్తే, సూర్యాద్యజ్ఞః, పర్జన్యోఽన్న మాత్మా, నమస్తే ఆదిత్య, త్వమేవ ప్రత్యక్షం కర్మకర్తాసి, త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి, త్వమేవ ప్రత్యక్షం విష్ణురసి, త్వమేవ ప్రత్యక్షం రుద్రోఽసి, త్వమేవ ప్రత్యక్షం ఋుగసి, త్వమేవ ప్రత్యక్షం యజురసి, త్వమేవ ప్రత్యక్షం సామాసి త్వమేవ ప్రత్యక్ష మథర్వాసి, త్వమేవ సర్వం ఛందోఽసి.



## భజన

సూర్యనారాయణ - నారాయణ - నారాయణ
భాను నారాయణ - నారాయణ - నారాయణ
భాస్కర నారాయణ - నారాయణ - నారాయణ
రవి నారాయణ - నారాయణ - నారాయణ
సవిత నారాయణ - నారాయణ - నారాయణ

## సూర్యగాయత్రి

ఓం భాస్కరాయ విద్మహే
మహద్ద్యుతి కరాయ ధీమహి
తన్నో ఆదిత్యః ప్రచోదయాత్

# ఆదిత్య హృదయస్తోత్రం

ఓం అస్యశ్రీ ఆదిత్య హృదయ నామక స్తోత్రస్య అగస్త్య ఋషిః అనుష్టుప్ ఛందః ఆదిత్య హృదయభూతో భగవాన్ బ్రహ్మాదేవతా! నిరస్త అశేష విఘ్నతయా బ్రహ్మావిద్యా సిద్ధౌ వినియోగః

ఓం తత్సవితు ర్బ్రహ్మాత్మనే అంగుష్ఠాభ్యాం నమః
వరేణ్యం విష్ణ్వాత్మనే తర్జనీభ్యాం నమః
భర్గోదేవస్య రుద్రాత్మనే మధ్యమాభ్యాం నమః
ధీమహి ఈశ్వరాత్మనే అనామికాభ్యాం నమః



ధియో యోనః సదాశివాత్మనే కనిష్ఠికాభ్యాం నమః
ప్రచోదయాత్ పరమాత్మనే కరతల కరపృష్ఠాభ్యాం నమః
తత్సవితుర్బ్రహ్మాత్మనే శిరసే స్వాహా
భర్గోదేవస్య రుద్రాత్మనే శిఖాయై వషట్
ధీమహి ఈశ్వరాత్మనే కవచాయ హుం
ధియో యోనః సదాశివాత్మనే నేత్రత్రయాయ వౌషట్
ప్రచోదయాత్ పరమాత్మనే అస్త్రాయ ఫట్
భూర్భువః సువరోమితి దిగ్బంధః

## ధ్యానం

సూర్యం సుందర లోకనాథ మమృతం వేదాంతసారం శివం
జ్ఞానం బ్రహ్మామయం సురేశ మమలం లోకైక చిత్తం స్వయం.
ఇంద్రాదిత్య నరాధిపం సురగురుం త్రైలోక్య చూడామణిం
విష్ణుబ్రహ్మ శివ స్వరూప హృదయం వందే సదా భాస్కరమ్
మిత్ర రవి సూర్య భాను ఖగపూష హిరణ్యగర్భ
మరీచ్యాదిత్య సవిత్రర్క భాస్కరేభ్యో నమః



## ఆదిత్య హృదయస్తోత్రం

తతోయుద్ధ పరిశ్రాంతం సమరే చిన్తయా స్థితమ్ ।
రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్ ॥ 1

దైవతైశ్చ సమాగమ్య దృష్టు మభ్యాగతోరణమ్ ।
ఉపగమ్యా బ్రవీద్రామం అగస్త్యో భగవాన్ ఋషిః ॥ 2

రామరావణ యుద్ధమును వీక్షించుటకు దేవతలతో కలసివచ్చిన అగస్త్య భగవానుడు రాముని చూచాడు. యుద్ధమున అలసిపోయిన రాముడు మళ్ళీ తనతో పోరాడేందుకు ముందు నిలబడి యున్న రావణుని చూచి చింతాక్రాంతుడయ్యాడు. అగస్త్యమహర్షి రామునితో ఇలా పలికాడు.

**రామరామ మహాబాహో శ్రుణు గుహ్యం సనాతనమ్ ।**
**యేన సర్వానరీ న్వత్స సమరే విజయిష్యసి ॥** 3

**ఆదిత్య హృదయం పుణ్యం సర్వశత్రు వినాశనమ్ ।**
**జయావహం జపేన్నిత్యం అక్షయ్యం పరమం శివం ॥** 4

**సర్వమంగల మాంగల్యం సర్వపాప ప్రణాశనం ।**
**చిన్తా శోక ప్రశమనం ఆయుర్వర్ధన ముత్తమం ॥** 5

గొప్ప బాహువులు గల రామా! నాయనా! రామా! నిత్యమైన, రహస్యమైన స్తోత్రాన్ని విను. దాని ప్రభావం చేత రణరంగంలో శత్రువుల్ని జయిస్తావు. ఇది పుణ్యప్రదమైన ఆదిత్యహృదయ స్తోత్రము. ఇది శత్రువులను నాశనం



చేస్తుంది. జయమునిస్తుంది. అక్షయ ఫలాన్నిస్తుంది. పవిత్రమైనది. శుభకరమైన స్తోత్రాలన్నిటికంటె ఇది శుభప్రదమైనది. సర్వపాపములను హరిస్తుంది. చింతను తొలగిస్తుంది. శోకాన్ని పారద్రోలుతుంది. ఆయుషును పెంచుతుంది.

**రశ్మిమంతం సముద్యన్తం దేవాసుర నమస్కృతమ్ ।**
**పూజయస్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరం ॥** 6

సూర్యదేవుడు ప్రశస్త కిరణ శోభితుడు. నిత్యోదయము కలవాడు. దేవాసురులకు వందనీయుడు. తన వెలుగుతో సమస్త వెలుగులను ఆర్పి వేస్తాడు. కాంతినిస్తాడు. జగత్ప్రభువు. అట్టి ఆదిత్యుని ఆరాధించు.

**సర్వదేవాత్మకో హ్యేషః తేజస్వీ రశ్మిభావనః।**

**ఏష దేవాసుర గణాన్ లోకాన్ పాతి గభస్తిభిః॥ 7**

భానుడు సర్వదేవతా స్వరూపుడు. తేజోమయుడు. తన కిరణములచేత విశ్వానికి సత్తా స్ఫురణాలను కలిగించువాడు. దేవాసురులను రక్షించునది ఇతడే.

**ఏష బ్రహ్మాచ విష్ణుశ్చ శివస్కందః ప్రజాపతిః।**

**మహేంద్రో ధనదః కాలః యమ స్సోమో హ్యపాంపతిః॥ 8**

ఈ సూర్యుడే బ్రహ్మ. విష్ణువు. శివుడు. కుమారస్వామి. తొమ్మిదిమంది ప్రజాపతులు. ఇంద్రుడు. కుబేరుడు. కాలపురుషుడు. యముడు, సోముడు, వరుణుడు.



**పితరోవసవ స్సాధ్యాః అశ్వినౌ మరుతోమనుః।**

**వాయుర్వహ్నిః ప్రజాప్రాణః ఋతుకర్తా ప్రభాకరః॥ 9**

పితృదేవతలు, వసువులు, సాధ్యులు, అశ్వినీదేవతలు, మరుత్తులు. మనువు, వాయువు, అగ్ని, ప్రజలు, ప్రాణవాయువు - ఇవన్నీ సూర్యుడే. ఋతుకర్త, కాంతిదాత ఇతడే.

**ఆదిత్యః సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్।**

**సువర్ణ సదృశో భానుః హిరణ్యరేతా దివాకరః॥ 10**

అదితి పుత్రుడు, ప్రపంచాన్ని సృష్టించువాడు, జీవులను కర్మలలో నియమించువాడు, గగనవిహారి, ప్రపంచాన్ని వర్షముతో తడుపువాడు,

కిరణ్మయుడు, సువర్ణకాంతియుతుడు, ప్రకాశవంతుడు, బంగారము రేతస్సుగా గలవాడు, దివాకరుడు, - అన్నిరూపాలు సూర్యుడే.

**హరిదశ్వః సహస్రార్చిః సప్త సప్తి ర్మరీచిమాన్ ।**
**తిమిరోన్మథనః శంభుః త్వష్టా మార్తాండకః అంశుమాన్ ॥ 11**

ఆకుపచ్చని గుఱ్ఱములు కలవాడు, వేయి కిరణములు కలవాడు, చీకటిని పోగొట్టువాడు, సప్తాశ్వములు కలవాడు, కిరణ్మయుడు, తిమిరహరుడు, సుఖమును వృద్ధిచేయువాడు, సర్వరూప సంహారకుడు, బ్రహ్మాండమును పునః సృష్టించువాడు, కిరణములు గలవాడు - అతడే సూర్యుడు.

**హిరణ్యగర్భః శిశిరః తపనో భాస్కరో రవిః ।**
**అగ్నిగర్భః అదితేః పుత్రః శంఖః శిశిర నాశనః ॥ 12**



హిరణ్య గర్భుడు, తాపత్రయములను పోగొట్టువాడు, వేడి పుట్టించు వాడు, పగటిని కల్పించువాడు, గర్భమునందు అగ్ని గలవాడు, అదితి కుమారుడు, సాయంకాలము శాంతించువాడు, మంచును కరిగించువాడు, అతడే. సూర్యుడు.

**వ్యోమనాథం తమోభేదీ ఋగ్యజుస్సామ పారగః ।**
**ఘనవృష్టిః అపాంమిత్రః వింధ్యవీథీ ప్లవంగమః ॥ 13**

ఆకాశమునకు ప్రభువైనవాడు, రాహువును భేదించువాడు, త్రైవేద్య పారంగతుడు, గొప్ప వర్షము కలవాడు, జలములకు మిత్రుడు, గగనమున శీఘ్రముగా పయనించువాడు - అతడే. సూర్యుడే.

**అతపీ మండలీ మృత్యుః పింగల స్సర్వతాపనః ।**
**కవిర్విశ్వో మహాతేజాః రక్తః సర్వభవోద్భవః ॥ 14**

ఎండ గలవాడు, మండలము గలవాడు, శత్రువులకు మృత్యు సమానుడు, ఎఱ్ఱని వర్ణము గలవాడు, సర్వమును సర్వులను తపింప చేయువాడు, కవి, ప్రపంచమును నడుపువాడు, గొప్ప ప్రకాశవంతుడు, సర్వులపై అనురాగము గలవాడు, సర్వమునకు పుట్టుక స్థానమైనవాడు. అతడే- సూర్యుడే.

**నక్షత్ర గ్రహ తారాణాం అధిపో విశ్వభావనః।**

**తేజసా మపి తేజస్వీ ద్వాదశాత్మ న్నమోస్తుతే॥ 15**

నక్షత్ర, గ్రహ, తారకలకు అధిపతి, విశ్వభావనుడు, వెలుగులకు వెలుగైన వాడు, పన్నెండు రూపములు గలవాడు. సూర్యదేవునకు నమస్కారము.



**నమః పూర్వాయ గిరయే పశ్చిమా యాద్రయే నమః।**

**జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః॥ 16**

పూర్వగిరి రూపునకు నమస్కారము. పశ్చిమ గిరి రూపునకు నమస్కారము. జ్యోతిర్గణముల అధిపతికి నమస్కారము. దినాధిపతికి నమస్కారము.

**జయాయ జయ భద్రాయ హర్యశ్వాయ నమోనమః।**

**నమోనమః సహస్రాంశో ఆదిత్యాయ నమో నమః॥ 17**

జయము నిచ్చువానికి, జయమును వృద్ధి చేయువానికి, ఆకుపచ్చని గుఱ్ఱములు గలవానికి నమస్కారము. వేయి కిరణములు గల దేవా! పదే పదే నమస్కారము. ఆదిత్యునకు నమస్కారము.

**నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమో నమః ।**

**నమః పద్మ ప్రబోధాయ మార్తాండాయ నమోనమః ॥** 18

శత్రువులకు ఉగ్రుడైన వానికి, వీరుడైన వానికి, శీఘ్రయానము చేయు వానికి, పద్మములను వికసింపజేయువానికి, తీక్షణమైన వానికి నమస్కారము.

**బ్రహ్మేశా నాచ్యుతేశాయ సూర్యాయాదిత్య వర్చసే ।**

**భాస్వతే సర్వ భక్షాయ రౌద్రాయ వపుషే నమః ॥** 19

త్రిమూర్త్యాత్మునకు, సూర్యునకు, ఆదిత్య రూపమైన ప్రకాశము గలవానికి, సర్వసంహారకునకు, రౌద్రరూపునకు నమస్కారము.

**తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయ అమితాత్మనే ।**

**కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః ॥** 20



తిమిర హరునకు, మంచును కరిగించువానికి, శత్రువులను హరించు వానికి, అవధిలేనివానికి, కృతఘ్నులను సంహరించువానికి, ప్రకాశించువానికి, సమస్త జ్యోతులకు ప్రభువైన సూర్యునకు ప్రణామము.

**తప్తచామీ కరాభాయ హరయే విశ్వకర్మణే**

**నమస్తమోభి నిఘ్నాయ రుచయే లోక సాక్షిణే ॥** 21

కరిగిన బంగారు కాంతిగలవానికి, హరునకు, విశ్వకర్తకు, తిమిరహరునకు, ప్రకాశరూపునకు, లోకములకు సాక్షియైన వానికి నమస్కారము. సూర్య దేవునకు నమస్కారము.

**నాశయత్యేష వై భూతం తదేవ సృజతి ప్రభుః ।**

**పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః ॥** 22

జగత్తును నశింప చేయునది ఇతడే. సృజించునది కూడా ఇతడే. కిరణముల చేత తపింపచేసేది కూడా ఇతడే. వర్షించునది కూడా ఇతడే.

**ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః ।**
**ఏష చైవాగ్ని హోత్రంచ ఫలం చైవాగ్ని హోత్రిణామ్ ॥ 23**

అందరూ నిద్రించువేళ అతడు మేల్కొని ఉంటాడు. అతడే అగ్ని హోత్రము. అగ్నిహోత్రము చేయువారికి ఫలప్రదాత కూడా అతడే.

**వేదాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవ చ ।**
**యాని కృత్యాని లోకేషు సర్వేషు పరమప్రభుః ॥ 24**

వేదములు, క్రతువులు, క్రతువుల ఫలము కూడా అతడే. లోకముల యందలి సర్వకార్యముల యందు ఇతడే సమర్థుడు.



**ఏన మాపత్సు కృచ్ఛ్రేషు కాంతారేషు భయేషు చ ।**
**కీర్తయన్ పురుషః కశ్చిత్ నావసీదతి రాఘవ! ॥ 25**

రామా! ఆపదలలో, కష్టాలలో, దుర్గమ మార్గాలలో, భయసమయాలలో ఎవడు సూర్యుని స్తుతిస్తాడో అతడు నశించడు.

**పూజయస్వైన మేకాగ్రో దేవదేవం జగత్పతిం ।**
**ఏతత్త్రి గుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి ॥ 26**

జగత్తునకు ప్రభువైన ఆ దేవదేవుని స్థిరచిత్తముతో పూజించు. ఈ ఆదిత్య హృదయాన్ని మూడు పర్యాయములు పఠిస్తే యుద్ధంలో విజయాన్ని సాధించగలవు.

**అస్మిన్ క్షణే మహాబాహో రావణం త్వం వధిష్యసి ।**

**ఏవముక్త్వా తదాగస్త్యః జగామ చ యథాగతమ్ ॥ 27**

ఓ మహాబాహో! నీవు రావణుణ్ణి ఈ క్షణమునందే వధించగలవు; అని పలికి అగస్త్యుడు అంతర్హితుడయ్యాడు.

**ఏతచ్ఛ్రుత్వా మహాతేజాః నష్టశోకో భవత్తదా ।**

**ధారయామాస సుప్రీతః రాఘవః ప్రయతాత్మవాన్ ॥ 28**

గొప్ప మనస్సు గల రాముడు దీనిని ఆలకించి దుఃఖాన్ని త్యజించాడు. సంతసించిన రాముడు నిశ్చలమైన చిత్తముతో ఆదిత్య హృదయస్తోత్రాన్ని మనసులో నిలుపుకున్నాడు.



**ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వాతు పరం హర్ష మవాప్తవాన్ ।**

**త్రిరాచమ్య శుచిర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్ ॥ 29**

పరాక్రమవంతుడైన రాముడు మూడుసార్లు పవిత్రంగా ఆచమనం చేసి, సూర్యుణ్ణి చూసి, ఆదిత్య హృదయాన్ని జపించి, గొప్ప సంతోషాన్ని పొంది ధనుస్సును గ్రహించాడు.

**రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధాయ సముపాగమత్ ।**

**సర్వ యత్నేన మహతా వధే తస్య ధృతోఽభవత్ ॥ 30**

రావణుని చూస్తూ, తృప్తి చెందిన మనస్సుతో యుద్ధానికి వచ్చాడు. సర్వవిధాల రావణుని వధించుటకు నిర్ణయించుకున్నాడు.

**అథ రవి రవద న్నిరీక్ష్య రామం ముదితమనాః పరమం ప్రహృష్య మాణః।**

**నిశిచరపతి సంక్షయం విదిత్వా సురగణ మధ్య గతో వచస్త్వరేతి ॥31**

అప్పుడు సంతోషించిన సూర్యభగవానుడు రోమాంచమైన దేహముతో దేవతల మధ్య నిలబడి, రావణుని అంత్యకాలాన్ని తెలిసి, రామునివైపు చూచి "కానీ, తొందరపడు" అని పలికాడు.

ఇతి ఆదిత్య హృదయ స్తోత్రం





# మృత్యుంజయ మంత్రము

**ఓం త్ర్యంబకం యజామహే**

**సుగంధిం పుష్టి వర్ధనమ్**

**ఉర్వారుక మివ బంధనాత్**

**మృత్యోర్ముక్షీయ మామృతాత్**

# శాంతిమంత్రములు

ఓం స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః
గో బ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు!

కాలే వర్షతు పర్జన్యః
పృథివీ సస్య శాలినీ
దేశో ఽయం క్షోభరహితః
బ్రాహ్మణా స్స న్తు నిర్భయాః ॥



ఓం అసతో మా సద్గమయ!
తమసో మా జ్యోతిర్గమయ!
మృత్యోర్మా అమృతం గమయ!
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం సర్వే భవన్తు సుఖినః సర్వేసన్తు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యన్తు మా కశ్చిత్ దుఃఖ భాగ్భవేత్
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం సర్వేషాం స్వస్తిర్భవతు! సర్వేషాం శాంతిర్భవతు!
సర్వేషాం పూర్ణం భవతు! సర్వేషాం మంగలం భవతు!
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే ॥
ఓం శాంతిః శాంతిః శాంతిః



# సోమేశ్వరం



## శివ ప్రాతఃస్మరణ స్తోత్రమ్

**ప్రాతః స్మరామి భవభీతి హరం సురేశం**
**గంగాధరం వృషభవాహన మంబికేశమ్ ।**
**ఖట్వాంగ శూల వరదాభయహస్త మీశం**
**సంసార రోగ హర మౌషధ మద్వితీయమ్ ॥ 1**

సంసార భయమును నిర్మూలించే దేవదేవుడు, గంగాధరుడు, నంది వాహనుడు, పార్వతీనాథుడు శూలమును ఒక చేతిలో, అక్షయ పాత్రను మరొక చేతిలో ధరించి, ఒక చేతితో అభయ ప్రదానం చేస్తూ, మరొక చేతితో



వరములిచ్చే ప్రభువు, భవరోగమును నివారించే దివ్యౌషధమైన అద్వయరూప శివుని ప్రాతఃకాలమున స్మరించుచున్నాను.

**ప్రాతర్నమామి గిరిశం గిరిజార్థదేహం**
**సర్గస్థితి ప్రలయకారణ మాదిదేవమ్ ।**
**విశ్వేశ్వరం విజిత విశ్వ మనోభిరామం**
**సంసార రోగహర మౌషధ మద్వితీయమ్ ॥ 2**

పార్వతీదేవిని తన దేహంలో సగభాగము నింపుకున్న గిరిజాపతి, సృష్టిస్థితి లయాలకు కారణమైన ఆదిదేవుడు, మనస్సును రంజింపచేయు మంజుల రూపముగల విశ్వేశ్వరుడు, భవరోగమును నివారించే దివ్యౌషధమైన అద్వయ రూప శివుని ప్రాతఃకాలమున నమస్కరించుచున్నాను.

ప్రాతర్భజామి శివమేక మనంత మాద్యం
వేదాంత వేద్య మనఘం పురుషం మహాన్తమ్ ।
నామాది భేదరహితం షడ్భావ శూన్యం
సంసార రోగహర మౌషధ మద్వితీయమ్ ॥ 3

అనంతుడు, అద్వయుడు, ఆదిదేవుడు, వేదాంత ప్రమాణము ద్వారా గ్రహింపదగినవాడు, పాపరహితుడు, పరమపురుషుడు, నామరూప రహితుడు, షడ్భావ వికారములు లేనివాడు, భవరోగమును నివారించే దివ్యౌషధమైన అద్వయరూప శివుని ప్రాతఃకాలమున భజించుచున్నాను.



ప్రాతః సముత్థాయ శివం విచింత్య
శ్లోక త్రయం యేఽనుదినం పఠంతి ।
తే దుఃఖజాతం బహుజన్మ సంచితం
హిత్వాపదం యాంతి తదేవ శంభోః ॥

ప్రభాత సమయాన నిద్రను విడిచి, నిర్మల హృదయంతో శివుని ధ్యానించి, ఈ మూడు శ్లోకములను నిత్యము పఠించేవారు, అనేక జన్మలలో ప్రోగు చేసుకున్న పాప సంచితము నుండి విముక్తులై మోక్షమును పొందుతారు.

ఇతి శ్రీ శివస్య ప్రాతః స్మరణమ్

# గణేశ ద్వాదశ నామావళిః

**ప్రణమ్య శిరసా దేవం గౌరీపుత్రం వినాయకమ్ ।**

**భక్తావాసం స్మరేన్నిత్యం ఆయుః కామార్థ సిద్ధయే ॥ 1**

భక్త హృదయవాసి, గౌరీనందనుడు, దేవదేవుడైన వినాయకుని ఆయుషును, అభీష్టమును సిద్ధింప జేయుమని నిత్యము శిరమోడ్చి నమస్కరిస్తున్నాను.

**ప్రథమం వక్రతుండంచ ఏకదంతం ద్వితీయకం ।**

**తృతీయం కృష్ణపింగాక్షం గజవక్త్రం చతుర్థకం ॥ 2**



**లంబోదరం పంచమంచ షష్ఠం వికట మేవచ ।**

**సప్తమం విఘ్నరాజంచ ధూమ్ర వర్ణం తథాష్టకం ॥ 3**

**నవమం బాలచంద్రంచ దశమంతు వినాయకం ।**

**ఏకాదశం గణపతిం ద్వాదశంతు గజాననం ॥ 4**

**ద్వాదశైతాని నామాని త్రిసంధ్యం యః పఠేన్నరః ।**

**న చ విఘ్న భయం తస్య సర్వ సిద్ధికరం ప్రభో ॥ 5**

విఘ్ననాయకుడైన వినాయకుని "వక్రతుండా! ఏకదంతా! కృష్ణపింగాక్షా! గజవక్త్రా! లంబోదరా! వికటా! విఘ్నరాజా! ధూమ్రవర్ణా! బాలచంద్రా! వినాయకా! గణపతి! గజాననా!" అని ఎవరైతే ద్వాదశనామాలతో పిలుస్తూ

స్మరిస్తూ ఉంటారో, అట్టివారు సమస్త కార్యాలను నిర్విఘ్నముగా సాగించి సిద్ధిని సాధించుటే గాక అభయమూర్తులై శోభిస్తారు.

## విశ్వనాథాష్టకమ్

గంగా తరంగ రమణీయ జటా కలాపం
గౌరీ నిరంతర విభూషిత వామ భాగమ్ ।
నారాయణ ప్రియ మనంగ మదాపహారం
వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్ ॥ 1


వాచామగోచర మనేకగుణ స్వరూపం
వాగీశ విష్ణు సురసేవిత పాదపీఠమ్ ।
వామేన విగ్రహ వరేణ కలత్రవంతం
వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్ ॥ 2

భూతాధిపం భుజగ భూషణ భూషితాంగం
వ్యాఘ్రాజినాంబరధరం జటిలం త్రినేత్రమ్ ।
పాశాంకుశాభయ వరప్రద శూలపాణిం
వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్ ॥ 3

శీతాంశు శోభిత కిరీట విరాజమానం
భాలేక్షణానల విశోషిత పంచబాణమ్ ।
నాగాధిపారచిత భాసుర కర్ణపూర్ణం
వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్ ॥ 4

పంచాననం దురితమత్త మతంగజానాం
నాగాంతకం దనుజ పుంగవ పన్నగానామ్ ।
దావానలం మరణ శోక జరాటవీనాం
వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్ ॥ 5



తేజోమయం సగుణ నిర్గుణ మద్వితీయం
ఆనందకంద మపరాజిత మప్రమేయమ్ ।
నాగాత్మకం సకల నిష్కల మాత్మరూపం
వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్ ॥ 6

రాగాది దోషరహితం స్వజనానురాగం
వైరాగ్యశాంతి నిలయం గిరిజా సహాయం
మాధుర్య ధైర్య సుభగం గరలాభిరామం
వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్ ॥ 7

ఆశాం విహాయ పరిహృత్య పరస్య నిందాం
పాపే రతిం చ సునివార్య మనః సమాధౌ ।
ఆదాయ హృత్కమల మధ్యగతం పరేశం
వారాణసీ పురపతిం భజ విశ్వనాథమ్ ॥ 8

## ఫలం

వారాణసీ పురపతేః స్తవనం శివస్య
వ్యాఖ్యాత మష్టక మిదం పరతే మనుష్యః ।
విద్యాం శ్రియం విపులసౌఖ్య మనంత కీర్తిం
సంప్రాప్య దేహవిలయే లభతే చ మోక్షమ్ ॥ 9



**విశ్వనాథాష్టక మిదం యః పఠే చ్ఛివ సన్నిధౌ ।**
**శివలోక మవాప్నోతి శివేన సహ మోదతే ॥** 10

## ప్రవచనం

**లలాట లిఖితా రేఖా**

**పరిమాష్టుం న శక్యతే!** - బ్రహ్మదేవుడు నొసటన వ్రాసిన గీతను తప్పించటం ఎవరికీ సాధ్యం కాదు అంటారు. ఈ మాట సత్యమా! సత్యమే అయితే, లిఖించినాడు కనుక అది ఉన్నది. అది ఉన్నదానికి అంతముంటుంది. కాకపోతే, దానిని అంతం చేయడమెలాగో మనకు తెలిసి రావాలి. అంతే,

నాసటన తాండవమాడే ప్రారబ్ధాన్ని నాసటన జ్ఞాననేత్ర మున్నవాడే తొలగించగలడు. అతడే పరమశివుడు. ముక్కంటి. ముక్కంటికి మన మొరను వినిపిస్తే, ప్రక్కింటికి తెలియకుండా బాధలు పారిపోతాయి. భవరోగాలు తొలగిపోతాయి.

ఎదురుచెప్పకుండా యెదబాధను నివారించి, అశుభాన్ని తొలగించి, శుభాన్ని ప్రసాదించేవా డైనందున పరమశివుని మంగళకరుడని, జ్ఞాన స్వరూపుడని వేదం ప్రవచించింది.

**ఈశానః సర్వవిద్యానాం**

**ఈశ్వరః సర్వభూతానాం**



**బ్రహ్మాధిపతిః బ్రహ్మణోధిపతిః**

**బ్రహ్మా శివో మే అస్తు సదాశివోమ్** - అన్నది తైత్తిరీయం.

ఆవేదనలన్నీ అంతరించే ఆశ్రయస్థానం శివస్థానం. కష్టాలన్నీ శాశ్వతంగా కనుమరుగయ్యే కళ్యాణధామం శంకరనామం.

శివుడు రాగి కాడు. విరాగీ కాడు. తనకన్నా అన్యంగా ఏదీ లేదనే జ్ఞానంతో శోభించే ప్రశాంతమూర్తి. తనలో తాను ఉండటమే ఆ దివ్యాత్ముని వైరాగ్యము.

ఈ స్థాయిని చేరేందుకు రాగి విరాగి కావాలి. విరాగి యోగి కావాలి. యోగి యోగీశ్వరుడు కావాలి. ఇలా తరించమని తెలిపేందుకే శివుడు బాహ్యాడంబరాలు లేని నిర్మల నిరాడంబర శోభతో గోచరిస్తాడు. సదా ధ్యానమగ్నుడై కనిపిస్తాడు.

శివుడు ప్రేమ స్వరూపుడు. ఆశ్రితుల కన్నీళ్ళు తుడిచే కరుణామయుడు.

పాముల్ని చూచి అందరూ పరుగెత్తిపోతారు. కాని, శివుడు వాటినే ఆభరణాలుగా అలంకరించుకున్నాడు. ప్రపంచం ఎవరినైనా దూరం చేయవచ్చు. పరమాత్మ అందరినీ దగ్గరికి చేర్చుకుంటాడు. అది అతని ప్రేమ.

మహేశ్వరుడు మోహనమూర్తి.

నందీశ్వరుడు వాహనమూర్తి.

నంది పశువైనా పశుపతిని ముందుంచుకొనిన భాగ్యానికి పూజ లందుకొంటోంది. సంసారాలు మోయడం అందరికీ ప్రీతి. శివుణ్ణి మోయడం నందికి ప్రీతి. సత్యము బుద్ధికి పట్టాలేగాని అసత్యాలు రుచిస్తాయా?



అందరి బ్రతుకుల్లో అమంగళం దూరం కావాలి. బాధలనుండి బ్రతుకులు విడిపడాలి. వసుధ అంతయు ఒకే కుటుంబం కావాలి. అప్పుడే నిత్యకళ్యాణం.

ఆ కుటుంబమే శివకుటుంబం.

పరమశివుని కుటుంబం.

ఇది తెలిసి జీవిస్తే, ప్రతి ఇల్లూ కైలాసమవుతుంది. ప్రతి వ్యక్తికీ కైవల్యం సిద్ధిస్తుంది.

**జై జై మహాదేవ!**




పల్లవి :- అద్వైతామృత ఆనందప్రియ
అగణిత గుణగణ సుందరశివ
సుందరశివ - సుందరేశ శివ!

చరణములు :-

1. ఛిద్రమైన జీవితాలకు
భద్రనౌకవు రుద్రదేవా!



బరువు బ్రతుకుల బాధల నణచి
బోధలు పంచే భువనవంద్య ॥అద్వైత॥

2. తోడు నీడ నాకు లేదు
ఆశ ఒక్కటే నాకు తోడు
సుందరమైన నిన్ను వలచి
ఆశ కూడ నన్ను విడిచె ॥అద్వైత॥

3. పుట్టి చేసిన పుణ్యమేదో
పంచచేరి కంచమాయె

వల్లకాటి భాగ్యమేదో
నీకు తానె మంచమాయె
బుద్ధులున్న నేరమునకా
నరుల బ్రతుకు వంచనాయె ॥అద్వైత॥

4. తలచిన లూతకు శుభగతి
పిలిచిన హస్తికి సులువది
వలచిన నాగును కనికరించి
కొలచిన మాకు దూరమైతివా! ॥అద్వైత॥



## శివగాయత్రి

**తత్పురుషాయ విద్మహే**
**మహాదేవాయ ధీమహి**
**తన్నో రుద్రః ప్రచోదయాత్.**

# శ్రీశివాష్టోత్తర శతనామావళిః

1. ఓం శివాయ నమః
2. ఓం మహేశ్వరాయ నమః
3. ఓం శంభవే నమః
4. ఓం పినాకినే నమః
5. ఓం శశిశేఖరాయ నమః
6. ఓం వామదేవాయ నమః
7. ఓం విరూపాక్షాయ నమః
8. ఓం కపర్దినే నమః
9. ఓం నీలలోహితాయ నమః
10. ఓం శంకరాయ నమః
11. ఓం శూలపాణయే నమః
12. ఓం ఖట్వాంగినే నమః
13. ఓం విష్ణువల్లభాయ నమః
14. ఓం శిపి విష్టాయ నమః



15. ఓం అంబికానాథాయ నమః
16. ఓం శ్రీకంఠాయ నమః
17. ఓం భక్తవత్సలాయ నమః
18. ఓం భవాయ నమః
19. ఓం శర్వాయ నమః
20. ఓం త్రిలోకేశాయ నమః
21. ఓం శితికంఠాయ నమః
22. ఓం శివాప్రియాయ నమః
23. ఓం ఉగ్రాయ నమః
24. ఓం కపాలినే నమః
25. ఓం కామారయే నమః
26. ఓం అంధకాసురసూదనాయ నమః
27. ఓం గంగాధరాయ నమః
28. ఓం లలాటాక్షాయ నమః
29. ఓం కాలకాలాయ నమః
30. ఓం కృపానిధయే నమః
31. ఓం భీమాయ నమః
32. ఓం పరశుహస్తాయ నమః
33. ఓం మృగపాణయే నమః
34. ఓం జటాధరాయ నమః

35. ఓం కైలాసవాసినే నమః
36. ఓం కవచినే నమః
37. ఓం కఠోరాయ నమః
38. ఓం త్రిపురాన్తకాయ నమః
39. ఓం వృషాంకాయ నమః
40. ఓం వృషభారూఢాయ నమః
41. ఓం భస్మోద్ధూళిత విగ్రహాయ నమః
42. ఓం సామప్రియాయ నమః
43. ఓం స్వరమయాయ నమః
44. ఓం త్రయీ మూర్తయే నమః
45. ఓం అనీశ్వరాయ నమః
46. ఓం సర్వజ్ఞాయ నమః
47. ఓం పరమాత్మనే నమః
48. ఓం సోమసూర్యాగ్ని లోచనాయ నమః
49. ఓం హవిషే నమః
50. ఓం యజ్ఞమయాయ నమః
51. ఓం సోమాయ నమః
52. ఓం పంచవక్త్రాయ నమః
53. ఓం సదాశివాయ నమః
54. ఓం విశ్వేశ్వరాయ నమః



55. ఓం వీరభద్రాయ నమః
56. ఓం గణనాథాయ నమః
57. ఓం ప్రజాపతయే నమః
58. ఓం హిరణ్యరేతసే నమః
59. ఓం దుర్ధర్షాయ నమః
60. ఓం గిరీశాయ నమః
61. ఓం గిరిశాయ నమః
62. ఓం అనఘాయ నమః
63. ఓం భుజంగ భూషణాయ నమః
64. ఓం భర్గాయ నమః
65. ఓం గిరిధన్వనే నమః
66. ఓం గిరిప్రియాయ నమః
67. ఓం కృత్తివాససే నమః
68. ఓం పురారాతయే నమః
69. ఓం భగవతే నమః
70. ఓం ప్రమథాధిపాయ నమః
71. ఓం మృత్యుంజయాయ నమః
72. ఓం సూక్ష్మతనవే నమః
73. ఓం జగద్వ్యాపినే నమః
74. ఓం జగద్గురవే నమః

75. ఓం వ్యోమకేశాయ నమః
76. ఓం మహాసేన జనకాయ నమః
77. ఓం చారువిక్రమాయ నమః
78. ఓం రుద్రాయ నమః
79. ఓం భూతపతయే నమః
80. ఓం స్థాణవే నమః
81. ఓం అహిర్బుధ్న్యాయ నమః
82. ఓం దిగంబరాయ నమః
83. ఓం అష్టమూర్తయే నమః
84. ఓం అనేకాత్మనే నమః
85. ఓం సాత్త్వికాయ నమః
86. ఓం శుద్ధవిగ్రహాయ నమః
87. ఓం శాశ్వతాయ నమః
88. ఓం ఖండపరశవే నమః
89. ఓం అజాయ నమః
90. ఓం శాపవిమోచకాయ నమః
91. ఓం మృడాయ నమః
92. ఓం పశుపతయే నమః



93. ఓం దేవాయ నమః
94. ఓం మహాదేవాయ నమః
95. ఓం అవ్యయాయ నమః
96. ఓం హరయే నమః
97. ఓం పూషదన్తభిదే నమః
98. ఓం అవ్యగ్రాయ నమః
99. ఓం దక్షాధ్వరహరాయ నమః
100. ఓం హరాయ నమః
101. ఓం భగనేత్రభిదే నమః
102. ఓం అవ్యక్తాయ నమః
103. ఓం సహస్రాక్షాయ నమః
104. ఓం సహస్రపదే నమః
105. ఓం అపవర్గ ప్రదాయ నమః
106. ఓం అనంతాయ నమః
107. ఓం తారకాయ నమః
108. ఓం పరమేశ్వరాయ నమః

ఇతి శ్రీశివాష్టోత్తర శతనామావళిః

## భజన

గిరిజా రమణ గౌరీశ
గంగాధర హర పరమేశ
సాంబ సదాశివ శంభో శంకర
భవాని శంకర మహాదేవా!
పంకజలోచన పార్వతి నాయక
హరహర హరహర మహాదేవా!
శివశివ హర చైతన్య శివ ॥గిరిజ॥



భక్తజనాప్రియ భవాని సుందర
పార్వతి రమణ పరమేశ
చంద్రకళాధర పూర్ణపరాత్పర
చిదంబరేశా శివరాజా
నర్తన సుందర నటరాజా ॥గిరిజా॥



# మృత్యుంజయ మంత్రము

ఓం త్ర్యంబకం యజామహే
సుగంధిం పుష్టివర్ధనమ్ ।
ఉర్వారుక మివ బంధనాత్
మృత్యోర్ముక్షీయ మామృతాత్ ॥



# శాంతి మంత్రములు

ఓం స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః ।
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు!

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్య శాలినీ
దేశోఽయం క్షోభరహితః బ్రాహ్మణా స్స న్తు నిర్భయాః ॥

ఓం అసతో మా సద్గమయ!

తమసో మా జ్యోతిర్గమయ!

మృత్యోర్మా అమృతం గమయ!

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం సర్వే భవన్తు సుఖినః సర్వేసన్తు నిరామయాః

సర్వే భద్రాణి పశ్యన్తు మా కశ్చిత్ దుఃఖ భాగ్భవేత్ ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః



ఓం సర్వేషాం స్వస్తిర్భవతు! సర్వేషాం శాంతి ర్భవతు!

సర్వేషాం పూర్ణం భవతు! సర్వేషాం మంగలం భవతు!

ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే

పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః

# మంగళ హారతి







## హనుమత్ప్రాతః స్మరణం

శ్రీరామచంద్ర చరణాంబుజ మత్తభృంగ
శ్రీరామచంద్ర జపశీల భవాబ్ధిపోత।
శ్రీ జానకీ హృదయతాప నివారమూర్తే
శ్రీ వీరధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥

భక్తార్తి భంజన దయాకర యోగివంధ్య
శ్రీకేసరీ ప్రియతనూజ సువర్ణదేహ।
శ్రీభాస్కరాత్మజ మనోంబుజ చంచరీక
శ్రీవీరధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥

# హనుమత్ప్రార్థన

**గోష్పదీకృత వారాశిం మశకీకృత రాక్షసమ్ ।**
**రామాయణ మహామాలా రత్నం వన్దే అనిలాత్మజమ్ ॥ 1**

సముద్రాన్ని గోష్పదజలము వలె అవలీలగ దాటినవాడు, రాక్షసులను దోమల వలె మట్టు పెట్టినవాడు, రామాయణమనే గొప్పహారము నడుమ రత్నము వంటివాడు అయిన వాయు నందనుడైన హనుమంతునికి ప్రణామము.

**ఆంజనేయ మతి పాట లాననం కాంచనాద్రి కమనీయ విగ్రహమ్ ।**
**పారిజాత తరుమూల వాసినం భావయామి పవమాన నందనం ॥ 2**



ఎఱ్ఱని ముఖ పద్మముతో శోభించువాడు, బంగారు కొండవలె దివ్యమైన స్వరూపము కలవాడు, పారిజాత వృక్షము క్రింద వసించువాడు, వాయు పుత్రుడైన హనుమంతుని ధ్యానించుచున్నాను.

**అతులిత బలధామం స్వర్ణశైలాభదేహం**
**దనుజవన కృశానుం జ్ఞానినా మగ్రగణ్యమ్ ।**
**సకల గుణ నిధానం వానరాణా మధీశం**
**రఘుపతి ప్రియభక్తం వాతజాతం నమామి ॥ 3**

అసమాన శక్తిసంపన్నుడు, సువర్ణగిరి వలె ప్రకాశవంతమైన శరీరము కలవాడు, రాక్షసులనే అరణ్యానికి దావాగ్ని వంటివాడు, జ్ఞానులలో

అగ్రగణ్యుడు, సమస్త సుగుణములకు నిధియైనవాడు, వానరులలో శ్రేష్ఠుడు శ్రీరామచంద్రుని ప్రియభక్తుడైన హనుమంతునికి వందనము.

**అంజనానందనం వీరం జానకీ శోక నాశనం।**
**కపీశం అక్ష హన్తారం వందే లంకా భయంకరమ్ ॥ 4**

అంజనాదేవి కుమారుడు, గొప్పవీరుడు, సీతమ్మ దుఃఖమును పోగొట్టిన వాడు, కపీశ్వరుడు, అక్షకుమారుని వధించినవాడు, లంకా నగరానికి భీతిని కలిగించినవాడు నగు హనుమంతునకు వందనము.

**యత్ర యత్ర రఘునాథ కీర్తనం తత్ర తత్ర కృతమస్త కాంజలిమ్।**
**బాష్పవారి పరిపూర్ణ లోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్ ॥ 5**



ఎక్కడెక్కడ రామభజన జరుగుచుండునో అక్కడక్కడ శిరస్సుపై అంజలి నిడుకొని, ఆనంద బాష్ప పూర్ణ నేత్రుడైనవాడు, రాక్షసులను అంతమొందించు వాడు అయిన హనుమంతునికి ప్రణామము.

**ఉదయాదిత్య సంకాశం ఉదార భుజ విక్రమమ్।**
**కందర్పకోటి లావణ్యం సర్వవిద్యా విశారదమ్ ॥ 6**

ఉదయభానుని వలె వెల్గొందువాడు, గొప్ప భుజపరాక్రమము గలవాడు, కోటి మన్మథుల సౌందర్యముతో శోభించువాడు, సర్వ విద్యా విశారదుడు అయిన హనుమంతునికి వందనము.

## పాట

పల్లవి :- వందనమందుకో మారుతి
మది నీకర్పణ జేసితి
నా మది నీ కర్పణ జేసితి ॥వందన॥

చరణములు :-

1. నీకై ఎదురు చూచితి
నీకొరకే దారులు కాచితి
మాకుల మాటున ఆకుల పంచన
నిన్నే నిన్నే వెదికితి ॥వందన॥



2. ఆరని రెప్పల చూపులతో
మారని ఆశల రూపులతో
పరచిన మబ్బుల పరుపులలో
నీ పాదముద్రకై వేచితి ॥వందన॥

3. ఆకులతో తమల పాకులతో
నిన్నే సింగారించితి
సాకులతో నా శ్వాసలు కదుపుతూ
పోవక నీకై నిలిచితి ॥వందన॥

## హనుమ గాయత్రి

**ఆంజనేయాయ విద్మహే**
**వాయుపుత్రాయ ధీమహి**
**తన్నో హనుమత్ ప్రచోదయాత్**

## ప్రవచనం

రాజుల్ని జయిస్తే రాజ్యాలు లభిస్తాయి. నిన్ను నీవు జయిస్తే సుఖశాంతులు ప్రాప్తిస్తాయి. ఈ సత్యాన్ని చాటిచెప్పడమే గాక, చేసి చూపిన మంగళ మహనీయ మూర్తి హనుమంతుడు.



రామాయణంలో రమణీయ మూర్తి ఆంజనేయస్వామి. కిష్కింధ కాండములో ప్రథమంగా ఆయన దర్శన మవుతుంది.

**సంభ్రమః త్యజ్యతాం...** 'భయాన్ని విడిచిపెట్టండి' అనే అభయ వాక్యంతో హనుమంతుడు గోచరిస్తాడు. కనుకనే, భయాలలో, బాధలలో చిక్కుకుపోయిన వారందరూ,

**హనుమంతా! నీదే భారమంతా!**

అని సమస్తాన్ని వాయుపుత్రుని పాదములవద్ద సమర్పించి, రక్షణ లభించిందని హాయిగా గాలి పీల్చుకుంటారు.

అశోకవనంలో సీతమ్మ కూడా ఆ పనే చేసింది. తన భారాన్ని మోయమని, బాధను తొలగించమని ఆంజనేయ స్వామిని అర్థించింది.

**త్వమస్మిన్ కార్యనిర్యోగే ప్రమాణం హరిసత్తమ**

**హనుమన్ యత్న మాస్థాయ దుఃఖక్షయ కరోభవ!**

హనుమంతా! నీదే భారమంతా! ఈ కార్యాన్ని నిర్వహించే బాధ్యత నీదే. నీవే ఆలోచించాలి. నీ ప్రయత్నముతో నా దుఃఖాన్ని పోగొట్టు అన్నది సీతమ్మ. **తథేతి** - అలాగే అన్నాడు హనుమంతుడు. అలాగే చేశాడు. సీతమ్మ దుఃఖాన్ని పోగొట్టాడు.



మనమూ ఆంజనేయుని ఆశ్రయిద్దాం. అవగాహనతో భక్తిలో చరిద్దాం. ముక్తి ధామాన్ని అలంకరిద్దాం.

ఆంజనేయుని ఆరాధించడమంటే ఆ దివ్యాత్ముని లోని అసమాన వైభవమును చక్కగా దర్శించి, దానిని మన బ్రతుకులలో ప్రదర్శించడమని అర్థము.

హనుమంతుడు రామభక్తుడు. రామకార్యంలో అలుపెరుగనివాడు. అభిరుచులను ఆతిథ్యాలను మరచినవాడు. భయమెరుగనివాడు. సముద్రాన్ని దాటడానికి కూడా వెనుకాడనివాడు.

అంతటి వాడైనా అహంకారము తెలియనివాడు. వినయమును వదలని వాడు. నిర్వేదమును పొందనివాడు. ఇంద్రియ నిగ్రహముతో అకుంఠిత

కార్యదీక్షతో జీవితమును సాగించి భక్తలోకానికి ఆదర్శమై భాసించాడు.

హనుమంతుడు వానరుడు.

అయినా నరులకు, సురులకు కూడా పూజనీయుడయ్యాడు. ఆ మహితాత్ముని బాటలో మనమూ చరించి తరించెదము గాక!

**మహాజనో యేన గత స్స పన్థాః**

మహాత్ములు పోయిన మార్గమే మార్గము - ఈ మహావాక్యాన్ని నిరంతరం మదిలో పదిలపరచుకొని, హనుమంతుని పవిత్ర బాటలో సదా పయనించెదము గాక!

పవనసుత హనుమాన్ కీ జై!



# హనుమద్వందనం

**మనోజవం మారుత తుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం।**
**వాతాత్మజం వానర యూథముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి ॥1**

మనోవేగము కలవాడు, వాయువేగముతో కూడినవాడు, జితేంద్రియుడు, వివేకవంతులలో శ్రేష్ఠుడు, వాయుపుత్రుడు, వానర సేనలో ముఖ్యుడు, శ్రీరాముని దూత యైన హనుమంతునికి శిరసా ప్రణామము.

**శ్రీమద్భూసుత శోక నాశన కరం శ్రీ ఆంజనేయం సదా**
**నానాలంకరణం త్రిపంచ నయనం దేదీప్యమానం రుచా।**

**అక్షఘ్నం ఘన శత్రు చాప దమనం శ్రీరుద్ర రూపం విభుం।**

**శత్రుఘ్నం తరుణార్క కాన్తి వదనం శ్రీరామదూతం భజే॥ 2**

భూదేవి కుమార్తె అయిన సీతమ్మ శోకమును పోగొట్టినవాడు, అనేక అలంకారములతో శోభించువాడు, పదిహేను కళ్ళు గలవాడు, దివ్య కాంతితో శోభించువాడు, రావణ కుమారుడైన అక్షుని వధించినవాడు, శత్రు సంహారి, భయంకర రూపముతో శోభిల్లువాడు, ప్రభువు, శత్రువులను వధించువాడు, బాలభానుని వంటి వదనకాంతితో శోభించువాడు శ్రీరాముని దూతయైన హనుమంతునికి నమస్కారము.

**అమల కమల వర్ణం ప్రజ్వల త్పావకాభం**

**సరసిజ నిభవక్త్రం సర్వదా సుప్రసన్నం।**



**పటు తర ఘన గాత్రం భానుకోటి ప్రకాశం।**

**రణ జయ కరవాలం రామదూతం నమామి॥ 3**

నిర్మలమైన కమలము వలె శోభించువాడు, ప్రజ్వలించు అగ్నివంటి ప్రకాశము కలవాడు, పద్మమువలె సుందరమైన ముఖముతో శోభించువాడు, నిరంతరము ప్రసన్నముగ గోచరించువాడు, దృఢమైన దేహము కలవాడు, కోటి సూర్య ప్రకాశముతో భాసిల్లువాడు, సమర విజయహేతువైన ఖడ్గము వంటివాడు, శ్రీరాముని దూత అయిన హనుమంతునికి వందనము.

**ధ్యాయేద్బాల దివాకర ద్యుతి నిభం దేవారి దర్పాపహం**

**దేవేంద్ర ప్రముఖ ప్రశస్త విభవం దేదీప్య మానం రుచా।**

**సుగ్రీవాది సమస్త వానరయుతం సువ్యక్త తత్త్వప్రియం ।**

**సంయుక్తా యుత లోచనం పవనజం పీతాంబరాలంకృతమ్ ॥ 4**

బాలభానుని వంటి ప్రకాశము కలవాడు, దానవుల మద మణచినవాడు, దేవేంద్రుడు మొదలైన సుర ప్రముఖులచే ప్రశంసింపబడిన వైభవము కలవాడు, దేదీప్యమానమగు కాంతితో కూడినవాడు, సుగ్రీవుడు మొదలైన వానరయోధులతో కూడియుండువాడు, తత్త్వజ్ఞాన సంపన్నుడు, వాయుపుత్రుడు, పీతవస్త్రమును ధరించినవాడు - నగు హనుమంతునికి ప్రణామము.

**సీతారామ గుణగ్రామ పుణ్యా రణ్య విహారిణౌ ।**

**వందే విశుద్ధ విజ్ఞానౌ కవీశ్వర కపీశ్వరౌ ॥ 5**



సీతారాముల కళ్యాణ గుణ సమూహమనే పుణ్యారణ్యమున విహరించు వారు, పరిశుద్ధ విజ్ఞానమూర్తులు - నగు కవీశ్వరుడైన వాల్మీకి మహర్షికి, కపీశ్వరుడైన హనుమంతునకు వందనములు.

**బుద్ధిర్బలం యశోధైర్యం నిర్భయత్వం అరోగతా ।**

**అజాడ్యం వాక్పటుత్వం చ హనుమ త్స్మరణా ద్భవేత్ ॥ 6**

హనుమంతుని స్మరించుట వలన బుద్ధి, బలము, కీర్తి, ధైర్యము, అభయస్థితి, ఆరోగ్యము, ఉత్సాహము, వాక్శుద్ధి పుష్కలంగా లభిస్తాయి.

## భజన

వాతాత్మజ హనుమాన్ శ్రీరామ దూత హనుమాన్।
హనుమాన్ మహిమాన్ హనుమాన్ మహిమాన్॥
జై అంజని సుత హనుమాన్ ॥వాతాత్మజ॥

కంజనేత్ర హనుమాన్ సంజీవన హనుమాన్।
వాయుపుత్ర హనుమాన్ భవాబ్ధిపోత హనుమాన్ ॥వాతాత్మజ॥



## శ్రీ మదాంజనేయాష్టోత్తర శతనామావళిః

1. ఓం శ్రీఆంజనేయాయ నమః
2. ఓం మహావీరాయ నమః
3. ఓం హనుమతే నమః
4. ఓం మారుతాత్మజాయ నమః
5. ఓం తత్త్వజ్ఞానప్రదాయ నమః
6. ఓం సీతాదేవీముద్రాప్రదాయకాయ నమః
7. ఓం అశోకవనికాచ్ఛేత్రే నమః
8. ఓం సర్వమాయావిభఞ్జనాయ నమః
9. ఓం సర్వబంధవిమోక్త్రే నమః
10. ఓం రక్షోవిధ్వంసకారకాయ నమః
11. ఓం పరవిద్యాపరీహారాయ నమః
12. ఓం పరశౌర్యవినాశనాయ నమః
13. ఓం పరమంత్రనిరాకర్త్రే నమః

14. ఓం పరమంత్ర ప్రభేదకాయ నమః
15. ఓం సర్వగ్రహవినాశినే నమః
16. ఓం భీమసేన సహాయకృతే నమః
17. ఓం సర్వదుఃఖహరాయ నమః
18. ఓం సర్వలోకచారిణే నమః
19. ఓం మనోజవాయ నమః
20. ఓం పారిజాతద్రుమూలస్థాయ నమః
21. ఓం సర్వమంత్రస్వరూపిణే నమః
22. ఓం సర్వతంత్ర స్వరూపిణే నమః
23. ఓం సర్వయన్త్రాత్మకాయ నమః
24. ఓం కపీశ్వరాయ నమః
25. ఓం మహాకాయాయ నమః
26. ఓం సర్వరోగహరాయ నమః
27. ఓం ప్రభవే నమః
28. ఓం బలసిద్ధికరాయ నమః
29. ఓం సర్వ విద్యాసమ్పత్ప్ర దాయకాయ నమః
30. ఓం కపిసేనానాయకాయ నమః



31. ఓం భవిష్యచ్చతురాననాయ నమః
32. ఓం కుమారబ్రహ్మచారిణే నమః
33. ఓం రత్నకుండల దీప్తిమతే నమః
34. ఓం సంచలద్వాల సన్నద్ధ లమ్బ మాన శిఖోజ్జ్వలాయ నమః
35. ఓం గంధర్వవిద్యా తత్త్వజ్ఞాయ నమః
36. ఓం మహాబలపరాక్రమాయ నమః
37. ఓం కారాగృహవిమోక్త్రే నమః
38. ఓం శృఙ్ఖలాబన్ధమోచకాయ నమః
39. ఓం సాగరోత్తారకాయ నమః
40. ఓం ప్రాజ్ఞాయ నమః
41. ఓం రామదూతాయ నమః
42. ఓం ప్రతాపవతే నమః
43. ఓం వానరాయ నమః
44. ఓం కేసరీసుతాయ నమః
45. ఓం సీతాశోకనివారణాయ నమః
46. ఓం అఞ్జనాగర్భసంభూతాయ నమః
47. ఓం బాలార్కసదృశాననాయ నమః
48. ఓం విభీషణప్రియకరాయ నమః

49. ఓం దశగ్రీవకులాన్తకాయ నమః
50. ఓం లక్ష్మణ ప్రాణదాత్రే నమః
51. ఓం వజ్రకాయాయ నమః
52. ఓం మహాద్యుతయే నమః
53. ఓం చిరంజీవినే నమః
54. ఓం రామభక్తాయ నమః
55. ఓం దైత్యకార్యవిఘాతకాయ నమః
56. ఓం అక్షహన్త్రే నమః
57. ఓం కాంచనాభాయ నమః
58. ఓం పఞ్చవక్త్రాయ నమః
59. ఓం మహాతపసే నమః
60. ఓం లఙ్కిణీభంజనాయ నమః
61. ఓం శ్రీమతే నమః
62. ఓం సింహికాప్రాణభంజనాయ నమః
63. ఓం గన్ధమాదనశైలస్థాయ నమః
64. ఓం లఙ్కాపురవిదాహకాయ నమః
65. ఓం సుగ్రీవసచివాయ నమః
66. ఓం ధీరాయ నమః



67. ఓం శూరాయ నమః
68. ఓం దైత్యకులాంతకాయ నమః
69. ఓం సురార్చితాయ నమః
70. ఓం మహాతేజసే నమః
71. ఓం రామచూడామణి ప్రదాయ నమః
72. ఓం కామరూపిణే నమః
73. ఓం పిఙ్గళాక్షాయ నమః
74. ఓం వార్ధి మైనాకపూజితాయ నమః
75. ఓం కబళీకృత మార్తాణ్డ మణ్డలాయ నమః
76. ఓం విజితేన్ద్రియాయ నమః
77. ఓం రామసుగ్రీవ సన్ధాత్రే నమః
78. ఓం మహారావణ మర్ధనాయ నమః
79. ఓం స్ఫటికాభాయ నమః
80. ఓం వాగధీశాయ నమః
81. ఓం నవవ్యాకృతి పణ్డితాయ నమః
82. ఓం చతుర్బాహవే నమః
83. ఓం దీనబంధవే నమః
84. ఓం మహాత్మనే నమః

85. ఓం భక్తవత్సలాయ నమః
86. ఓం సఞ్జీవన నగార్త్రే నమః
87. ఓం శుచయే నమః
88. ఓం వాగ్మినే నమః
89. ఓం దృఢవ్రతాయ నమః
90. ఓం కాలనేమిప్రమథనాయ నమః
91. ఓం హరిమర్కటమర్కటాయ నమః
92. ఓం దాన్తాయ నమః
93. ఓం శాన్తాయ నమః
94. ఓం ప్రసన్నాత్మనే నమః
95. ఓం శతకణ్ఠమదాపహృతేనమః
96. ఓం యోగినే నమః
97. ఓం రామకథాలోలాయ నమః
98. ఓం సీతాన్వేషణపణ్డితాయ నమః
99. ఓం వజ్రదంష్ట్రాయ నమః
100. ఓం వజ్రనఖాయ నమః
101. ఓం రుద్రవీర్యసముద్భవాయ నమః
102. ఓం ఇన్ద్రజిత్ప్రహితామోఘ బ్రహ్మాస్త్రవినివారకాయ నమః



103. ఓం పార్థ ధ్వజాగ్ర సంవాసినే నమః
104. ఓం శరపఞ్జర భేదకాయ నమః
105. ఓం దశబాహవే నమః
106. ఓం లోకపూజ్యాయ నమః
107. ఓం జాంబవత్ప్రీతి వర్ధనాయ నమః
108. ఓం సీతాసమేత శ్రీరామపాద సేవా దురంధరాయ నమః

ఇతి శ్రీమదాంజనేయాష్టోత్తర శతనామావళిః

## భజన

రామలక్ష్మణ జానకీ
జై బోలో హనుమాన్‌కీ ॥రామ॥

## మృత్యుంజయ మంత్రము

ఓం త్ర్యంబకం యజామహే
సుగంధిం పుష్టివర్ధనమ్।
ఉర్వారుక మివ బంధనాత్
మృత్యోర్ముక్షీయ మామృతాత్॥

## శాంతి మంత్రములు

ఓం స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః।



గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు!

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్య శాలినీ
దేశోఽయం క్షోభరహితః బ్రాహ్మణా స్స న్తు నిర్భయాః॥

ఓం అసతో మా సద్గమయ!
తమసో మా జ్యోతిర్గమయ!
మృత్యోర్మా అమృతం గమయ!
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం సర్వే భవన్తు సుఖినః సర్వేసన్తు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యన్తు మా కశ్చిత్ దుఃఖ భాగ్భవేత్ ॥
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం సర్వేషాం స్వస్తిర్భవతు! సర్వేషాం శాంతి ర్భవతు!
సర్వేషాం పూర్ణం భవతు! సర్వేషాం మంగలం భవతు!
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే ॥
ఓం శాంతిః శాంతిః శాంతిః



# బుద్ధం



# ప్రాతః స్మరణ స్తోత్రమ్

ప్రాతః స్మరామి హృది సంస్ఫుర దాత్మ తత్త్వం
సచ్చిత్సుఖం పరమహంసగతిం తురీయమ్ ।
యత్ స్వప్న జాగర సుషుప్త మవైతి నిత్యమ్
తద్బ్రహ్మ నిష్కల మహం న చ భూత సంఘః ॥ 1

ఆత్మరూపము, సత్యజ్ఞానానంద స్వరూపము, పరమహంసల గమ్యము, తురీయము, అవస్థాత్రయమునకు సాక్షి, నిత్యము, నిష్కళము అగు బ్రహ్మమును నేనే. పాంచభౌతికమైన దేహమును నేనుగాను అని ప్రభాత సమయాన హృదయంలో స్మరిస్తున్నాను.



ప్రాతర్భజామి మనసా వచసామ గమ్యం
వాచో విభాన్తి నిఖిలా యదను గ్రహేణ ।
యన్నేతి నేతి వచనైః నిగమా అవోచుః
తం దేవ దేవం అజ మచ్యుత మాహురగ్ర్యమ్ ॥ 2

మనోవాక్కులకు అందనివాడు, ఎవరి అనుగ్రహంతో సమస్తవాక్కులు వ్యక్తము లగుచున్నవో అట్టివానిని ప్రాతః కాలమున కీర్తించుచున్నాను. ఎవరిని శ్రుతిమాత "ఇది కాదు - ఇదికాదు అని వర్ణించినదో అట్టివానిని ఋషులు దేవదేవుడని, పుట్టక లేనివాడని, నాశ మెరుగని వాడని, ఆదిదేవుడని వర్ణించారు.

**ప్రాతర్నమామి తమసః పరమర్కవర్ణం**

**పూర్ణం సనాతన పదం పురుషోత్త మాఖ్యమ్।**

**యస్మిన్నిదం జగదశేష మశేష మూర్తౌ**

**రజ్జ్వాం భుజంగ మ ఇవ ప్రతిభాసితం వై॥** 3

అవిద్యాతీతము, ఆదిత్య ప్రభా సదృశము, పూర్ణస్వరూపము, శాశ్వతము, అయిన పురుషోత్తమాఖ్య పరమాత్మను ప్రభాత సమయాన నమస్కరించు చున్నాను. సమస్త నామరూపాలు తన స్వరూపముగా కలిగిన ఆ పరబ్రహ్మము నందు ఈ ప్రపంచమంతయు రజ్జువు నందు సర్పము వలె భాసించుచున్నది.



**శ్లోకత్రయ మిదం పుణ్యం**

**లోకత్రయ విభూషణమ్।**

**ప్రాతః కాలే పఠేద్యస్తు**

**స గచ్ఛేత్ పరమం పదం॥** 4

ముల్లోకాలకు అలంకారయుతమైన ఈ శ్లోక త్రయమును ఎవరైతే ప్రాతఃకాలమున పఠిస్తారో వారు మోక్షమును పొంది తరిస్తారు.

ఇతి శ్రీశంకర భగవత్పూజ్యపాద విరచితం

ప్రాతః స్మరణ స్తోత్రమ్.

# విజ్ఞాన నౌక

శ్రీ మచ్ఛంకర భగవత్పాదకృతము

**తపోయజ్ఞదానాదిభిః శుద్ధబుద్ధి**
**ర్విరక్తో నృపాదౌ పదే తుచ్ఛబుద్ధ్యా।**
**పరిత్యజ్య సర్వం యదాప్నోతి తత్త్వం**
**పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి॥** 1

తపో యజ్ఞ దానాది సాధనల ద్వారా అంతఃకరణ శుద్ధిని పొందిన సాధకుడు రాజాది భోగములు తుచ్ఛమనెడి భావనతో విరక్తుడై, సమస్తమును



త్యజించి, ఏ పరబ్రహ్మమును పొందుచున్నాడో ఆ పరబ్రహ్మమును నేనే అయి ఉన్నాను.

**దయాలుం గురుం బ్రహ్మ నిష్ఠం ప్రశాంతం**
**సమారాధ్య మత్యా విచార్య స్వరూపమ్।**
**యదాప్నోతి తత్త్వం నిదిధ్యాస్య విద్వాన్**
**పరంబ్రహ్మ నిత్యం తదేవాహమస్మి॥** 2

దయామయుడు, ప్రశాంతచిత్తుడు, బ్రహ్మనిష్ఠుడు అగు సద్గురువును సేవించి, తన స్వరూపమును గూర్చి విచార మొనర్చి, సత్యస్వరూపమును ధ్యానించి సాధకోత్తముడు ఏ పరబ్రహ్మమును పొందుచున్నాడో ఆ పరబ్రహ్మమును నేనే అయి ఉన్నాను.

**యదానందరూపం ప్రకాశస్వరూపం**
**నిరస్తప్రపంచం పరిచ్ఛేదశూన్యమ్।**
**అహం బ్రహ్మవృత్త్యైక గమ్యం తురీయం**
**పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి॥ 3**

కేవలానంద రూపమును, స్వప్రకాశ చైతన్యమును, భేదరూప జగత్తును నిరసించినదియు, దేశ, కాల, వస్తు పరిచ్ఛేదము లేనిదియు, నేనే బ్రహ్మమును అనుభావనచే అనుభూతి కలుగునదియు, తురీయ మైనదియు అగు పరబ్రహ్మ మేది కలదో ఆ పరబ్రహ్మమును నేనే అయి ఉన్నాను.



**యదజ్ఞానతో భాతి విశ్వం సమస్తం**
**వినష్టం చ సద్యో యదాత్మప్రబోధే।**
**మనోవాగతీతం విశుద్ధం విముక్తం**
**పరంబ్రహ్మ నిత్యం తదేవాహమస్మి॥ 4**

ఏది తెలియకపోవుట వలన సమస్తమైన ప్రపంచము ఉన్నట్లు తెలియుచున్నదో, ఏ బ్రహ్మాత్మ ప్రబోధము వలన ఈ ప్రపంచమంతయు వెంటనే నశించునట్లుండునో, మనస్సునకు, వాక్కునకు అందనిదియై, విశుద్ధమై, సర్వబంధముక్తమై, నిత్యమై భాసించు పరబ్రహ్మమేది కలదో ఆ పరబ్రహ్మమును నేను అయిఉన్నాను.

నిషేధే కృతే నేతి నేతీతి వాక్యైః

సమాధి స్థితానాం యదాభాతి పూర్ణమ్।

అవస్థాత్రయాతీత మేకం తురీయం

పరంబ్రహ్మ నిత్యం తదేవాహమస్మి॥ 5

ఇది కాదు - ఇదికాదు అని వేదాంత వాక్యములచేత సమస్త పదార్థములు బ్రహ్మము కాదని నిషేధింపబడగా, సమాధి నిష్ఠులైనవారికి ఏది పూర్ణముగా భాసించునో, అవస్థాత్రయమునకు సాక్షియై, ఏకమై, తురీయమై, నిత్యమై భాసించు పరబ్రహ్మమేది కలదో ఆ పరబ్రహ్మమును నేనే అయి ఉన్నాను.



యదానందలేశై స్తదానంది విశ్వం

యదాభాన సత్త్వే తదాభాతి సర్వమ్।

యదాలోచనారూప మన్యత్ సమస్తం

పరంబ్రహ్మ నిత్యం తదేవాహమస్మి॥ 6

దేనియొక్క ఆనందలేశముచే ఈ ప్రపంచమంతయు ఆనందించుచున్నదో, దేని జ్ఞాన ప్రకాశముచే ఈ ప్రపంచమంతయు భాసించుచున్నదో, మిగిలినదంతయు దేని స్వరూపాలోచనా రూపమో, నిత్యమై భాసించు పరబ్రహ్మమేది కలదో ఆ పరబ్రహ్మమును నేనే అయి ఉన్నాను.

**అనంతం విభుం సర్వయోనిం నిరీహం**
**శివం సంగహీనం యదోంకార గమ్యం।**
**నిరాకార మత్యుజ్జ్వలంమృత్యుహీనం**
**పరంబ్రహ్మ నిత్యం తదేవాహమస్మి॥** 7

అనంతమైనదియు, సర్వవ్యాపకమైనదియు, సమస్తమునకు కారణమైనదియు, ఏ కోరిక లేనిదియు, మంగళస్వరూపమైనదియు, అసంగమైనదియు, ఓంకార గమ్యమైనదియు, ఏ ఆకారము లేనిదియు, సదా స్వప్రకాశమైనదియు, మరణము లేనిదియు, నిత్యమైనదియు అగు పరబ్రహ్మమేది కలదో ఆ పరబ్రహ్మమును నేనే అయి ఉన్నాను.



**యదానందసింధౌ నిమగ్నః పుమాన్స్యాత్**
**అవిద్యావిలాసః సమస్తః ప్రపంచః।**
**యదా న స్ఫురత్యద్భుతం యన్నిమిత్తం**
**పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి॥** 8

బ్రహ్మనిష్ఠుడు ఎప్పుడు బ్రహ్మానంద సాగరమున మునిగి యుండునో అప్పుడు అతనికి సమస్త ప్రపంచము అజ్ఞాన విలాసముగ భాసిస్తుంది. ఏ బ్రహ్మము కారణముగా బ్రహ్మానుభూతిలో ఏదియు ఆశ్చర్యమనిపించదో, నిత్యమైన పరబ్రహ్మముగా ఏది భాసించుచున్నదో అట్టి పరబ్రహ్మమును నేనే అయి ఉన్నాను.

**స్వరూపాను సంధానరూపాం స్తుతింయః**

**పఠేదాదరా ద్భక్తిభావో మనుష్యః।**

**శృణోతీహ వా నిత్యముద్యుక్త చిత్తో**

**భవేద్విష్ణు రత్రైవ వేదప్రమాణాత్॥** 9

ఎవడు భక్తి భావయుతుడై, తన స్వరూపమును అనుసంధానము చేయు ఈ స్తోత్రమును సాదరముగ పఠించునో, ఎవడు నిరంతరము యోగయుక్త చిత్తుడై ఆలకించునో వారు ఇక్కడే వేదప్రమాణానుసారము సర్వవ్యాపకమైన పరబ్రహ్మ మవుతారు.



**విజ్ఞాన నావం పరిగృహ్య కశ్చిత్**

**తరే ద్య దజ్ఞానమయం భవాబ్ధిమ్।**

**జ్ఞానాసినా యోహి విచ్ఛిద్య తృష్ణాం**

**విష్ణోః పదం యాతి స ఏవ ధన్యః॥** 10

విజ్ఞాన నౌకను ఆశ్రయించిన ఒకానొకడు మాత్రమే అజ్ఞానమయమైన సంసార సాగరమును దాటుతాడు. జ్ఞానమనే ఖడ్గముచే ఎవడు ఆశాలతను ఖండించి, సర్వవ్యాపకమైన పరబ్రహ్మ పదమును చేరుకొనునో అతడే ధన్యుడు.

# ప్రవచనం

**అద్వైత నావం ఆశ్రిత్య**

**జీవన్ముక్తత్వం అప్నుయాత్**

అద్వైతమనే నావ నెక్కినవాడు జీవన్ముక్తిని పొందుతాడు.

**నదులెన్నయినా నీరొక్కటే**

**దీపాలెన్నున్నా కాంతి ఒక్కటే**

**ఊహలెన్నున్నా మనస్సు ఒక్కటే**

**నామారూపాలెన్నున్నా - సత్యమొక్కటే**



రెండున్నాయనే భ్రాంతిలో, ఉన్న ఒక్కదానికి దూరమైతే, బ్రతుకే భారంగా మిగుల్తుంది.

కళ్ళు రెండయినా చూపు ఒక్కటే

పెదవులు రెండయినా నవ్వు ఒక్కటే

మనిషి హృదయంలో రెండు ఒక్కటిగ మారితే వ్యక్తి కళ్యాణం. ఇదే లోకకళ్యాణం.

అనుభవము అనిత్యము . జ్ఞానము నిత్యము.

అనుభవంలో ఉండేది అహంకారము.

జ్ఞానములో శోభించేది అహం స్వరూపము.

అహంకారములో కారము కారిపోతే, 'అహం' స్వరూపం మధురమైన అఖండానందంగా శోభిస్తుంది.

ఇది కారిపోని సంపద

మారిపోని సౌందర్యం. కనుకనే ।

**ఆత్మవా అరె ద్రష్టవ్యః**

**శ్రోతవ్యః మన్తవ్యః నిదిధ్యాసితవ్యః ॥**

ఆత్మయే దర్శింపదగినది, ఆలకింపదగినది, ఆలోచింపదగినది, ధ్యానింపదగినది - అన్నది ఉపనిషత్తు.



భేదమును శాస్త్రము అంగీకరించదు.

తర్కము ఇష్టపడదు.

అనుభవము ఒప్పుకోదు.

అఖండాత్మలో భేదాలు అనూహ్యములు.

ఉన్నది ఆత్మయే. అఖండాత్మయే. ఇదే సర్వవేదాంత సిద్ధాంత సార సంగ్రహము. ఇదే శాస్త్ర తాత్పర్యము. సర్వశాస్త్రముల 'ఏకవాక్యతా."

**వేదాంత సిద్ధాంత నిరుక్తిః ఏషా**

**బ్రహ్మైవ జీవః సకలం జగచ్చ**

**అఖండరూప స్థితి రేవ మోక్షః**

**బ్రహ్మాద్వితీయే శ్రుతయః ప్రమాణం ॥**

"జీవుడు, సమస్తమైన జగత్తు బ్రహ్మమే. అఖండమైన స్వరూపస్థితిలో ఉండిపోవటమే మోక్షము. ఇదియే వేదాంత సిద్ధాంత నిర్వచనము. అద్వితీయమైన ఈ బ్రహ్మము విషయమున వేదములే ప్రమాణములు" అని తత్త్వసారాన్ని అందించారు శ్రీ శంకరాచార్యస్వామి.

ఓం తత్ సత్




పల్లవి :- కశ్చిత్ అస్తి అపారశక్తిః; అనంతశక్తిః ॥
కశ్చిత్ ఆభాతి సచ్చిద్వ్యోమ్ని ॥కశ్చిత్ ॥



చరణములు :-

1. నిరుపమ నిరవద్య నిత్య నిరాభాసం
నిర్వికార నిరస్త - ప్రపంచం।
నిర్వికల్ప నిరంజన నిర్బీజం
నిరీహ నితాంత నిర్మల ఆత్మా ॥ ॥ కశ్చిత్ ॥

2. సంతత మానంద మనుభవ రూపం
నిత్య ప్రబుద్ధ మరూప మనన్తం।
నకించిదస్తి తద్వ్య తిరిక్తం
సర్వం ఆత్మైవ తదేవ సర్వం ॥ ॥కశ్చిత్ ॥

3. చిదాకార చిదానంద చిన్ముద్రం
చిద్విలాస చిదాకాశ చిద్రూపం
చిదమల చిద్భవ చిరంతన చిన్మయం
చరతి చిద్గగనే చైతన్యాత్మ ॥కశ్చిత్ ॥

## బ్రహ్మజ్ఞానావళీ మాల

**అసఙ్గోఽహం అసఙ్గోఽహం అసఙ్గోఽహం పునః పునః।**
**సచ్చిదానంద రూపోఽహం అహమేవాహమవ్యయః॥ 1**



నేను అసంగుడను. నేను అసంగుడను. మళ్ళీ మళ్ళీ నేను అసంగుడను. సచ్చిదానంద రూపుడను. అవ్యయుడనైన నేను నేనే.

**నిత్యశుద్ధ విముక్తోఽహం నిరాకారోఽహ మవ్యయః।**
**భూమానంద స్వరూపోహం అహమేవాహమవ్యయః॥ 2**

నేను నిత్యుడను. శుద్ధుడను. ముక్తుడను. నిరాకారుడను. నేను అవ్యయుడను. భూమానంద స్వరూపుడను. అవ్యయుడనైన నేను నేనే.

**నిత్యోఽహం నిరవద్యోహం నిరాకారోహ మచ్యుతః।**
**పరమానంద రూపోహం అహమేవాహమవ్యయః॥ 3**

నేను నిత్యుడను. నిరవద్యుడను. నిరాకారుడను. నేను అచ్యుతుడను. పరమానంద రూపుడను. అవ్యయుడనైన నేను నేనే.

**శుద్ధ చైతన్యరూపో౽హం ఆత్మారామో౽హమేవ చ।**
**అఖండానంద రూపో౽హం అహమేవాహ మవ్యయః॥** 4

నేను శుద్ధ చైతన్య రూపుడను. నేను ఆత్మారాముడను. అఖండానంద రూపుడను. అవ్యయుడనైన నేను నేనే.

**ప్రత్యక్చైతన్య రూపో౽హం శాంతోహం ప్రకృతేః పరః।**
**శాశ్వతానందరూపోహం అహమేవాహమవ్యయః॥** 5

నేను ప్రత్యగాత్మ రూపుడను. శాంతరూపుడను. ప్రకృతికి అతీతుడను. శాశ్వతానంద రూపుడను. అవ్యయుడనైన నేనునేనే.



**తత్త్వాతీతః పరాత్మాహం మధ్యాతీతః పరః శివః।**
**మాయాతీతః పరంజ్యోతిః అహమేవాహమవ్యయః॥** 6

నేను తత్త్వాతీత పరమాత్మను. మాయాతీతమైన పరమశివుడను. మాయాతీతమైన పరంజ్యోతిని. అవ్యయుడనైన నేను నేనే.

**నానారూపవ్యతీతో౽హం చిదాకారోహ మచ్యుతః।**
**సుఖరూప స్వరూపో౽హం అహమేవాహమవ్యయః॥**

నేను నామరూపాలకు అన్యమైన వాడను. చిదాకార రూపుడను. అచ్యుతుడను. సుఖరూప స్వరూపుడను. అవ్యయుడనైన నేనునేనే.

**మాయా తత్కార్య దేహాది మమ నాస్త్యేవ సర్వదా ।**

**స్వప్రకాశైక రూపోఽహం అహమేవాహ మవ్యయః ।** 8

నాకు మాయగాని, మాయాకార్యములైన దేహాదులు గాని లేవు. నేను సదా స్వప్రకాశైక రూపుడను. అవ్యయుడనైన నేను నేనే.

**గుణత్రయవ్యతీతోఽహం బ్రహ్మాదీనాం చ సాక్ష్యహం ।**

**అనంతానంద రూపోఽహం అహమేవాహ మవ్యయః ॥** 9

నేను గుణత్రయమునకు అతీతుడను. బ్రహ్మాదులకు కూడా నేను సాక్షిని. అనంతానంద రూపుణ్ణి. అవ్యయుడనైన నేను నేనే.



**అంతర్యామి స్వరూపోఽహం కూటస్థః సర్వగోఽస్మ్యహం ।**

**సర్వసాక్షి స్వరూపోహం అహమే వాహ మవ్యయః ॥** 10

నేను అంతర్యామి స్వరూపుడను. కూటస్థుడను. సర్వగతుడను. సర్వసాక్షి స్వరూపుడను. అవ్యయుడనైన నేనునేనే.

**ద్వంద్వాది సాక్షిరూపోఽహం అచలోహం సనాతనః ।**

**సర్వసాక్షి స్వరూపోఽహం అహమేవాహ మవ్యయః ॥**

ద్వంద్వములకు నేను సాక్షిని. అచలుడను. సనాతనుడను. సర్వసాక్షి స్వరూపుడను. అవ్యయుడనైన నేను నేనే.

**ప్రజ్ఞాన ఘున ఏవాహం విజ్ఞానఘున ఏవచ ।**

**అకర్తా஽హం అభోక్తా஽హం అహమేవాహమవ్యయః ॥** **12**

నేను ప్రజ్ఞాన ఘున రూపుడను. విజ్ఞాన ఘున రూపుడను. నేను అకర్తను. అభోక్తను. అవ్యయుడనైన నేను నేనే.

**నిరాధార స్వరూపో஽హం సర్వాధారో஽హమేవ చ ।**

**ఆప్తకామ స్వరూపో஽హం అహమేవాహ మవ్యయః ॥** **13**

నేను నిరాధార స్వరూపుడను. సర్వాధారుడను. ఆప్తకామ స్వరూపుడను. అవ్యయుడనైన నేను నేనే.



**తాపత్రయ వినిర్ముక్తః దేహత్రయ విలక్షణః ।**

**అవస్థాత్రయ సాక్ష్యస్మి చ అహమేవాహమవ్యయః ॥** **14**

నేను తాపత్రయముల నుండి విడిపడినవాడను. శరీర త్రయమునకు విలక్షణుడను. అవస్థాత్రయమునకు సాక్షిని. అవ్యయుడనైన నేను నేనే.

## భజన

**మాధవ గిరిధర మదన గోపాల**

**హే మధుసూదన యదు నందలాల ।** ।మాధవ॥

ఇంద్రాది వందిత యక్ష స్వరూప
నిజరూపేణ అక్షయ రూపా ॥ మధవ॥
సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మా
త్వమేవ ఆత్మా బ్రహ్మా త్వమేవ ॥ మాధవ ॥

## బ్రహ్మాగాయత్రి

వేదాత్మనాయ విద్మహే
హిరణ్య గర్భాయ ధీమహి
తన్నో బ్రహ్మా ప్రచోదయాత్.



## మృత్యుంజయ మంత్రము

ఓం త్ర్యంబకం యజామహే
సుగంధిం పుష్టివర్ధనమ్।
ఉర్వారుక మివ బంధనాత్
మృత్యోర్ముక్షీయ మామృతాత్॥

## శాంతి మంత్రములు

ఓం స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః।

గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు!

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్య శాలినీ
దేశోఽయం క్షోభరహితః బ్రాహ్మణా స్స న్తు నిర్భయాః ॥

ఓం అసతో మా సద్గమయ!
తమసో మా జ్యోతిర్గమయ!
మృత్యోర్మా అమృతం గమయ!
ఓం శాంతిః శాంతిః శాంతిః



ఓం సర్వే భవన్తు సుఖినః సర్వేసన్తు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యన్తు మా కశ్చిత్ దుఃఖ భాగ్భవేత్ ॥
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం సర్వేషాం స్వస్తిర్భవతు! సర్వేషాం శాంతి ర్భవతు!
సర్వేషాం పూర్ణం భవతు! సర్వేషాం మంగలం భవతు!
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే ॥
ఓం శాంతిః శాంతిః శాంతిః






## సద్గురు ప్రాతఃస్మరణం

**శ్రీమత్పరం బ్రహ్మ గురుం స్మరామి**
**శ్రీమత్పరం బ్రహ్మ గురుం భజామి ।**
**శ్రీమత్పరం బ్రహ్మ గురుం వదామి**
**శ్రీమత్పరం బ్రహ్మ గురుం నమామి ॥** **1**

జ్ఞానరూపుడు, పరబ్రహ్మ స్వరూపుడు అయిన గురుదేవుని స్మరించు చున్నాను. జ్ఞానరూపుడు, పరబ్రహ్మ స్వరూపుడు అయిన గురుదేవుని భజించు చున్నాను. జ్ఞానరూపుడు, పరబ్రహ్మ స్వరూపుడు అయిన గురుదేవుని

పలుకుచున్నాను. జ్ఞానరూపుడు, పరబ్రహ్మ స్వరూపుడు అయిన గురుదేవుని నమస్కరించుచున్నాను.

**హృదంబుజే కర్ణిక మధ్య సంస్థే**
**సింహాసనే సంస్థిత దివ్యమూర్తిమ్ ।**
**ధ్యాయే ద్గురుం చంద్రకళా ప్రకాశం**
**సచ్చిత్సుఖాభీష్ట వరం దధానమ్ ॥ 2**

హృదయ కమల కర్ణిక నడుమ ఉన్నటువంటి సింహాసనమున చక్కగా అధిష్ఠించియున్న దివ్యమూర్తి, చంద్రరేఖ వంటి కాంతితో శోభించువాడు, సత్య జ్ఞానానంద స్వరూపుడు, వరము లొసగి అభీష్టములను తీర్చువాడు అయిన గురుదేవుని ధ్యానించాలి.



**వన్దే గురూణాం చరణారవిన్దే**
**సందర్శిత స్వాత్మ సుఖావ బోధే ।**
**జనస్య యే జాంగలి కాయ మానే**
**సంసార హాలాహల మోహశాన్త్యై ॥ 3**

సంసార మనే కాలకూట విషముచే మూర్ఛనొందిన జనులకు శ్రీ సద్గురు దేవుని చరణ కమలములు విషమును విరుగుడు చేయు వైద్యుని వలె శోభించు చున్నవి. సమ్యక్ దర్శనము గల ఆత్మానంద జ్ఞానముతో ప్రకాశించు చున్నవి. అట్టి సద్గురు దేవుని చరణ కమలములను నమస్కరించు చున్నాను.

**సంసార సాగర సముద్ధరణైక మంత్రం**

**బ్రహ్మాది దేవ ముని పూజిత సిద్ధమంత్రం।**

**దారిద్ర్య దుఃఖ భవరోగ వినాశ మంత్రం**

**వందే మహాభయహరం గురురాజ మంత్రమ్॥ 4**

భవ సాగరము నుండి చక్కగ ఉద్ధరించుటలో ముఖ్యమైన మంత్రము, బ్రహ్మాది దేవతల చేత, మహర్షుల చేత పూజింపబడి, వారికి సమస్త సిద్ధులను అనుగ్రహించిన మంత్రము, దారిద్ర్య దుఃఖమును సంసార రోగమును నశింప చేయు మంత్రము, గొప్ప భయమును పోగొట్టునది అయిన 'గురుః' - అనెడి మంత్ర రాజమునకు ప్రణామము.



# గురుస్తోత్రం

గురువు శిష్యుల పాలిటి కల్పతరువు. ముముక్షుజన లోకానికి కామధేనువు. గురుదేవుని వైభవాన్ని శాస్త్రము అనేక రీతుల కీర్తించింది. గురుపుంగవుని ప్రాభవాన్ని ఋషులు ఎంతగానో శ్లాఘించారు. గురుతత్త్వాన్ని, గురుదేవుని మహిమను స్వయంగా పరమేశ్వరుడే పార్వతీదేవికి ఇలా వర్ణించాడు.

**దుర్లభం త్రిషులోకేషు తచ్ఛృణుష్వ వదామ్యహమ్।**

**గురుబ్రహ్మ వినా నాన్యః సత్యం సత్యం వరాననే॥ 1**

పార్వతీ! ముల్లోకముల యందు దుర్లభమైన విషయమును చెబుతున్నాను. విను. గురువునకు అన్యముగ మరొకటి లేదు. ఇది సత్యము. పరమ సత్యము.

**గుకార శ్చాంధకారో హి రుకార స్తేజ రుచ్యతే।**

**అజ్ఞాన గ్రాసకం బ్రహ్మ గురురేవ న సంశయః॥** 2

'గు' అనగా అజ్ఞాన తిమిరము. 'రు' అనగా జ్ఞానతేజము. కనుక గురువు ఎవరో కాదు. అజ్ఞానమును అమాంతం మ్రింగునట్టి పరబ్రహ్మమే. ఈ విషయంలో సందేహము లేదు.



**గురురేకో జగత్సర్వం బ్రహ్మ విష్ణు శివాత్మకం।**

**గురోః పరతరం నాస్తి తస్మాత్సం పూజయే ద్గురుమ్॥** 3

బ్రహ్మ విష్ణు శివ స్వరూపమైన ఈ లోకమంతయు వాస్తవానికి గురుదేవుడే. అతడొక్కడే. గురువు కన్నను శ్రేష్ఠమైనది మరొకటి లేదు. అందుచేత గురుదేవుని సదా అర్చించాలి.

'తత్త్వమసి' - మహావాక్యము కూడా గురువైభవమేనని వరుసగా మూడు శ్లోకాలలో వివరిస్తున్నారు. మొదటిది 'తత్' పద నిర్దేశము.

**అఖండమండలా కారం వ్యాప్తం యేన చరాచరం।**

**తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః॥** 4

ఈ దృశ్యమాన జగత్తు అంతయూ ఏ పరమేశ్వరునిచే వ్యాప్తమై యున్నదో అట్టి 'తత్' పదరూపుని దర్శింప జేయునట్టి గురుదేవునకు వందనము.

## ఇపుడు 'త్వం' పద నిర్దేశము

**స్థావరం జంగమం వ్యాప్తం యత్కించిత్ స చరాచరమ్ ।**
**త్వం పదం దర్శితం యేన తస్మైశ్రీ గురవే నమః ॥ 5**

స్థావర జంగమాత్మక మగు ఈ సమస్త చరాచర జగత్తు ఏ అంతరాత్మచే వ్యాప్తమై యున్నదో అట్టి 'త్వం' పద రూపమును దర్శింప జేయునట్టి గురుదేవునకు వందనము.



## ఇప్పుడు చివరగా 'అసి' పద నిర్దేశము.

**చిన్మయ వ్యాపితం సర్వం త్రైలోక్యం స చరాచరమ్ ।**
**అసిత్వం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥ 6**

చరాచరాత్మకమగు త్రిలోకము లన్నియు ఏ చిన్మయ స్వరూపముచే వ్యాప్తమై యున్నవో అట్టి 'అసి' పద వైభవమును దర్శింపజేయునట్టి గురుదేవునకు వందనము.

**యస్మై కారణరూపాయ కార్య రూపేణ భాతి యత్ ।**
**కార్యకారణ రూపాయ తస్మై శ్రీ గురవే నమః ॥ 7**

కారణ రూపుడైన పరమాత్మకు ఏ ప్రపంచము కార్యరూపముతో ప్రకాశించుచున్నదో కార్యకారణ స్వరూపుడైన అట్టి గురు పరమాత్మకు నమస్కారము.

**గురురాది రనాదిశ్చ గురుః పరమ దైవతమ్।**

**గురు మంత్ర సమో నాస్తి తస్మై శ్రీ గురవే నమః॥** 8

గురుదేవుడు సర్వమునకు ఆదియైనవాడు. తనకు ఆది లేనివాడై అనాది యని కీర్తించబడినాడు. 'గురు' అను పదమునకు సరియైన మంత్రము లేదు. అట్టి గురుదేవునకు నమస్కారము.



**గురుమధ్యే స్థితం విశ్వం విశ్వ మధ్యే స్థితో గురుః।**

**గురుర్విశ్వం న చాన్యోఽస్తి తస్మై శ్రీ గురవే నమః॥** 9

గురుదేవునిలోనే ప్రపంచము తల దాచుకొని ఉంది. ప్రపంచంలో ఉన్నదంతయు గురు దేవుడే. సమస్త ప్రపంచము గురు రూపమే. అన్యముగా వేరొకటి లేదు. అట్టి గురుదేవునకు ప్రణామము.

"నేతి - నేతి" అనెడి ఉపనిష ద్వాక్యార్థము కూడా గురువైభవమే నని వర్ణిస్తున్నారు.

**యస్మాత్పరతరం నాస్తి నేతి నేతీతి వైశ్రుతిః।**

**మనసా వచసా చైవ సత్యం ఆరాధయే ద్గురుం॥** 10

"ఇది కాదు - ఇది కాదు" అనెడి వేదవాక్యము కూడా గురువు కంటెను మరొకటి శ్రేష్ఠమైనది లేదు అని తెలుపుచున్నది. కనుక సత్యమూర్తి యైన గురుదేవుని మనసా, వచసా ఆరాధించాలి.

**ఏవం విధం గురుం ధ్యాత్వా జ్ఞానం ఉత్పద్యతే స్వయమ్ ।**
**తదా గురూపదేశేన ముక్తోఽహ మితి భావయేత్ ॥** **11**

ఈవిధంగా గురుదేవుని ధ్యానించుట వలన స్వయంగా వివేకము కలుగుచున్నది. ఆ తరువాత గురుదేవుని ఉపదేశము వలన "నేను ముక్తుడ నైతిని" అని భావించటము జరుగుచున్నది.



**ఆనంద మానందకరం ప్రసన్నం**
**జ్ఞాన స్వరూపమ్ నిజబోధ యుక్తం**
**యోగీంద్ర మీడ్యం భవరోగ వైద్యం**
**శ్రీమద్గురుం నిత్య మహం నమామి ॥**

ఆనంద రూపుడు, ఆనంద ప్రదాత, ప్రసన్నమూర్తి, జ్ఞాన స్వరూపుడు, ప్రబోధయుతుడు, యోగీశ్వరుడు, సర్వ సంపూజ్యుడు, సంసార రోగానికి వైద్యుడు అయిన నా సద్గురు దేవుని నేను నిత్యము నమస్కరించుచున్నాను.

## భజన

పరమ మంగళ సద్గురుదేవా!
ముక్తి ప్రదాయక మమ గురుదేవా!

బ్రహ్మానంద సాగరరూపం
అఖండ మహిమా అద్భుతరూపం
నిగమాతీత నిర్మల రూపం
వేదవేదాంత బోధ స్వరూపం ॥పరమ॥



అనంతరూప అనంతనామ
అద్భుతచరిత ఆనందదాత
కైవల్య దాయక కరుణాంతరంగ
ప్రణవ స్వరూప హృదయాంతరంగ ॥పరమ॥

## గురుగాయత్రి

హంస హంసాయ విద్మహే
పరమ హంసాయ ధీమహి
తన్నో హంసః ప్రచోదయాత్ ॥

# ప్రవచనం

**స్వయం ఆచరతి**

**పరాన్ ఆచారయతి ఇతి ఆచార్యః**

తాను ఆచరించునది పరులు ఆచరించునట్లు చేయువాడు, తాను దర్శించినది పరులు దర్శించునట్లు చేయువాడే ఆచార్యుడు! ఆచార్యుడు దర్శించినది దేనిని?

**సర్వమాత్మైవ**

**తల్లక్ష్యం శుద్ధాత్మ దృష్ట్వావా యః పశ్యతి స ఏవ బ్రహ్మనిష్ఠోభవతి!**



సమస్తమును ఆత్మయే అనెడి వాక్య ప్రమాణముతో పరమాత్మనే లక్ష్యముగా దర్శించిన వాడే బ్రహ్మనిష్ఠుడు.

సమస్తము ఆత్మయే అయినపుడు మనం దేనిని ఆశించినా నిజానికి మనం ఆశిస్తున్నది ఆత్మనే. ఇది సులభంగా బోధపడే సత్యము కాదు. బోధపడని ఈ సత్యాన్ని ప్రమాణం ద్వారా బోధపడేటట్టు చేయువాడే సద్గురువు.

బోధను అందించే గురువు, గురువు అందించే బోధ రెండూ ఒక్కటే అని గుర్తించినపుడే బోధను అందించిన గురువు బోధకన్నా అన్యమైనవాడు కాడని తెలుస్తుంది.

కనుక గురువును దర్శించడమంటే జ్ఞానమును దర్శించడమని అర్థం. గురువు మనముందు వ్యక్తిగా లేడు. జ్ఞానంగా శోభిస్తున్నాడు. అందుకనే,

**ఆచార్య దేవోభవ**

"నీ గురువు నీకు దేవుడగు గాక!" అని వేదమాత దీవించింది.

క్షీరము నిచ్చేది ధేనువు

ఫలము నిచ్చేది తరువు

జ్ఞానము నిచ్చేది గురువు.

దేవగురుడు బృహస్పతి. గురుదేవు డెప్పుడైనా సరస్వతే.



**శాంతో మహాన్తో నివసన్తి సంతః**

**వసంత వత్ లోకహితం చరన్తః**

శాంతులు, మహాంతులు, అయిన సంత్ పురుషులు వసంత ఋతువు లాగ లోకానికి హితం చేస్తూ చరిస్తారు" అన్నారు శ్రీ శంకరాచార్య స్వామి.

ఆమనికి

ఆ మునికి ఎంత చక్కని పోలిక!

తాను శోభిస్తూ సర్వులకు శోభనిచ్చే వసంతం ఆమని. తాను తరించి, అన్యులను ఉద్ధరించే మణియే ముని.

ఈత తెలిసినవాడు మునిగిపోతున్న వ్యక్తిని ఫలాపేక్ష లేకుండా రక్షిస్తాడు.

**అహేతునాఽన్యానపి తారయన్తః**

కారణము లేకుండా మహాత్ములు మనల్ని తరింపచేస్తారు. మూల్యాన్ని ఆశించకుండా అమూల్యమైన అక్షయ సంపదను మన హృదయాలలో దించుతారు.

సద్గురువుల పాదముద్రలను దర్శిస్తూ మనమూ సాగిపోదాం. జ్ఞాన మార్గంలో చరించి తరించిపోదాం. . . .

*ఓం .... ఓం .... ఓం ....*

*ఆచార్యదేవోభవ!*



# గురుప్రార్థన

**ఓం బ్రహ్మానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిం**
**ద్వంద్వాతీతం గగన సదృశం తత్త్వమస్యాది లక్ష్యం**
**ఏకం నిత్యం విమల మచలం సర్వధీ సాక్షిభూతం**
**భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి!**

బ్రహ్మానంద స్వరూపుడు, ఉత్తమ సుఖమును ప్రసాదించువాడు, కేవలం ఆత్మజ్ఞాన స్వరూపుడు, సుఖదుఃఖాది ద్వంద్వములకు అతీతుడు, ఆకాశ రూపుడు, 'తత్త్వమసి' మొదలైన మహావాక్యముల ద్వారా తెలియబడువాడు,

ఏకరూపుడు, నిత్య స్వరూపుడు, నిర్మలుడు, అచలుడు, బుద్ధి వృత్తులకు సాక్షియైనవాడు, భావాతీతుడు, గుణాతీతుడు అయిన సద్గురు దేవునికి నమస్కారము.

## జగద్గుర్వష్టోత్తర శతనామావళిః

1. ఓం సద్గురవే నమః
2. ఓం సత్కృతయే నమః
3. ఓం సాక్షాత్ బ్రహ్మరూపాయ నమః
4. ఓం సదాశివాయ నమః
5. ఓం సనకాది మునిస్తుత్యాయ నమః
6. ఓం సర్వధర్మప్రవర్తకాయ నమః
7. ఓం సభాజ్యాయ నమః
8. ఓం సర్వభూతేశాయ నమః



9. ఓం సచ్చిదానంద విగ్రహాయ నమః
10. ఓం సుధాంశు కలితోత్తంసాయ నమః
11. ఓం సర్వకర్మ ఫలప్రదాయ నమః
12. ఓం దయాపయోనిధయే నమః
13. ఓం ధాత్రే నమః
14. ఓం దక్షిణామూర్తయే నమః
15. ఓం అవ్యయాయ నమః
16. ఓం అజ్ఞానమర్దినే నమః
17. ఓం విజ్ఞానదాయినే నమః
18. ఓం విధిహరీడితాయ నమః
19. ఓం చరాచర గురవే నమః
20. ఓం ఛేత్రే నమః
21. ఓం చిన్ముద్రాంకిత హస్తకాయ నమః
22. ఓం వటమూల స్థితాయ నమః
23. ఓం వీక్షాబోధితాగమ సారకాయ నమః
24. ఓం మౌన వ్యాఖ్యాపరాయ నమః
25. ఓం మాయా నాశనాయ నమః
26. ఓం మౌని మానితాయ నమః

27. ఓం సంచితాగామి పాపఘ్నాయ నమః
28. ఓం సంశయచ్ఛిదే నమః
29. ఓం సదాకృతయే నమః
30. ఓం యుగాధర్మహరాయ నమః
31. ఓం యోక్త్రే నమః
32. ఓం యూనే నమః
33. ఓం యోగ్యాయ నమః
34. ఓం యదార్థవిదే నమః
35. ఓం యోగాసన స్థితాయ నమః
36. ఓం యోగినే నమః
37. ఓం బ్రహ్మతత్త్వప్రకాశకాయ నమః
38. ఓం నిగమాన్త మహాతత్త్వ స్వరూపాయ నమః
39. ఓం నియమి ప్రియాయ నమః
40. ఓం తత్త్వమస్యాది లక్ష్యార్థాయ నమః
41. ఓం తత్త్వమర్థ ప్రబోధకాయ నమః
42. ఓం మునివేషధరాయ నమః
43. ఓం మౌనినే నమః
44. ఓం మానితాశేష సజ్జనాయ నమః
45. ఓం జానున్యస్త కరాయ నమః
46. ఓం జాయాపుత్ర విత్తైషణోజ్జితాయ నమః



47. ఓం జీవాత్మనే నమః
48. ఓం పరమాత్మనే నమః
49. ఓం సర్వాత్మనే నమః
50. ఓం సర్వవిదే నమః
51. ఓం సమాయ నమః
52. ఓం అస్థూలాయ నమః
53. ఓం అనణవే నమః
54. ఓం అహ్రస్వాయ నమః
55. ఓం అదీర్ఘాయ నమః
56. ఓం సర్వాన్తరాత్మకాయ నమః
57. ఓం అపాణిపాదాయ జవనాయ నమః
58. ఓం సర్వజ్ఞాయ నమః
59. ఓం సర్వశక్తిమతే నమః
60. ఓం అజాయ నమః
61. ఓం అపహత పాప్మనే నమః
62. ఓం తేజో రూపాయ నమః
63. ఓం త్రిలోచనాయ నమః
64. ఓం పరమాణవే నమః

65. ఓం పరమమహతే నమః
66. ఓం పరస్మై బ్రహ్మణే నమః
67. ఓం పరాత్పరాయ నమః
68. ఓం చిద్రూపాయ నమః
69. ఓం చిత్సభాదృశ్యాయ నమః
70. ఓం పంచకోశాంతరస్థితాయ నమః
71. ఓం అణోరణీయసే నమః
72. ఓం మహతో మహీయసే నమః
73. ఓం మహదాదికృతే నమః
74. ఓం నిర్లేపాయ నమః
75. ఓం నిర్గుణాయ నమః
76. ఓం నీలకంఠాయ నమః
77. ఓం నియత మానసాయ నమః
78. ఓం జన్మమృత్యుజరాచ్ఛేత్రే నమః
79. ఓం జగజ్జన్మాది కారణాయ నమః
80. ఓం మహావాక్యార్థ భూతాత్మనే నమః
81. ఓం మహాత్మనే నమః
82. ఓం మితవాచే నమః



83. ఓం మనవే నమః
84. ఓం పంచాక్షరీ జప ప్రీతాయ నమః
85. ఓం పంచకృత్య పరాయణాయ నమః
86. ఓం పరమాప్తాయ నమః
87. ఓం ప్రణవ రూపాయ నమః
88. ఓం ప్రణవార్థ ప్రకాశకాయ నమః
89. ఓం వేదపారాయణ ప్రీతాయ నమః
90. ఓం వేదాంతైకార్థరూపవతే
పురాణాగమ సారాత్మనే నమః
91. ఓం పురాణాయ నమః
92. ఓం పురుషోత్తమాయ నమః
93. ఓం పురుహూతాది దేవేడ్యాయ నమః
94. ఓం పుణ్యాలభ్యాయ నమః
95. ఓం పరన్తపాయ నమః
96. ఓం సర్వరూపాయ నమః
97. ఓం సర్వధరాయ నమః
98. ఓం సర్వాధారాయ నమః
99. ఓం సతాంగతయే నమః
100. ఓం దర్శనాన్ముక్తి ఫలదాయ నమః
101.ఓం దురితాత్మ సుదుర్లభాయ నమః

102. ఓం త్యక్తె షణాశ్రయాయ నమః
103. ఓం త్యాగి సన్యాస్యాత్మ స్వరూపధృతే నమః
104. ఓం ఘృతాక్తదీప ప్రీతాత్మనే నమః
105. ఓం సంసారభయనాశకాయ నమః
106. ఓం సర్వవైదిక సంపూజ్యాయ నమః
107. ఓం సర్వమంత్ర ఫలప్రదాయ నమః
108. ఓం స్వాభావిక సుఖైకాత్మనే నమః

ఓం ఇతి శ్రీకుమార సంహితాయాం అగస్త్యాయ సనత్కుమారోక్తా
దక్షిణామూర్త్యష్టోత్తర శతనామావళిః






పల్లవి :- కరుణామయ దేవా!
జైజై గురుదేవా!

అనుపల్లవి :- అజ్ఞాన నాశక
సుజ్ఞాన పోషక
సద్గురు మహదేవా!

చరణములు :-

1. తరువు ఒక్కటైనా
పక్షులు పదివేలు

గురువు ఒక్కడైనా
శిష్యులు వేలకు వేలు - భావికి
దారిదీపాలు ॥కరుణా॥

2. దేశం కాలం మాయాజాలం
సోకని నిరామయ!
అండపిండ బ్రహ్మాండంబున
వెలసిన వేల్పువయా! మా
భ్రాంతిని బాపుమయా! ॥కరుణా॥



3. నేనే దేవుడు - మ్రొక్కు నీ వనుచు
పలికెదరు సురులు
నీవే దేవుడు - నేనే నీవని
పలుకును గురుకవులు - మాకు
కామధేనువులు. ॥కరుణా॥

4. జాతిధర్మాలు - కులభేదాలు
తెలియని మహనీయా!
శాంతి ప్రేమలు - జ్ఞానజ్యోతులు
పంచే దయామయా!
చైతన్య హృదయ నిలయ! ॥కరుణా॥

# సద్గురు వందనమ్

**కృష్ణ ద్వైపాయనం వ్యాసం సర్వలోకహితే రతం।**
**వేదాబ్జ భాస్కరం వందే శమాది నిలయం మునిమ్॥ 1**

సమస్త లోకమునకు మేలు చేయువాడు, వేదకమలమును వికసింపచేసిన భాస్కరుడు, శమాది సుగుణములకు నిలయమైనవాడు కృష్ణద్వైపాయనుడైన వ్యాసమునికి వందనము.

**ధర్మజ్ఞం ధార్మికం ధీరం ధర్మాత్మానం దయానిధిం।**
**ధర్మశాస్త్ర ప్రవక్తారం పరాశర మునిం భజే॥ 2**



ధర్మమును తెలిసినవాడు, ధర్మరూపుడు, ధర్మాచరణలో ధీరుడు, ధర్మాత్ముడు, కరుణానిధి, ధర్మశాస్త్ర ప్రవక్తయైన పరాశర మహర్షిని సేవింతును.

**శ్రీ పరాశర పౌత్రం శ్రీవ్యాస పుత్రం అకల్మషం।**
**నిత్యవైరాగ్య సంపన్నం జీవన్ముక్తం శుకం భజే॥ 3**

శ్రీపరాశర మహర్షి మనుమడు, వ్యాసమహర్షి పుత్రుడు, నిత్య వైరాగ్య సంపన్నుడు, జీవన్ముక్తుడైన శ్రీశుక మహర్షికి నమస్కారము.

**బ్రహ్మర్షిః బ్రహ్మవిద్వర్యః బ్రాహ్మణ్యో బ్రాహ్మణప్రియః।**
**తపస్వీ తత్త్వ విద్వాం స్తు వసిష్ఠం భజేఽన్వహమ్॥ 4**

బ్రహ్మర్షి, బ్రహ్మవిద్వర్యుడు, బ్రహ్మజ్ఞాని, జ్ఞానప్రియుడు, తపస్వి, తత్త్వవిజ్ఞాని అయిన వసిష్ఠ మహర్షికి వందనము.

**కూజన్తం రామరామేతి మధురం మధురాక్షరం ।**
**ఆరుహ్య కవితాశాఖం వన్దే వాల్మీకి కోకిలమ్ ॥** 5

కవిత్వమనే కొమ్మపై నెక్కి రామ, రామ అను మధురవాక్కులను తియ్యగా గానము చేయు వాల్మీకి కోకిలకు నమస్కారము.

**శ్రుతి స్మృతి పురాణానాం ఆలయం కరుణాలయం ।**
**నమామి భగవత్పాద శంకరం లోకశంకరమ్ ॥** 6

వేదస్మృతి పురాణాలకు నిలయమైనవాడు, దయారూపుడు, లోక కళ్యాణమును ఆవిష్కరించు శ్రీ శంకర భగవత్పాదులకు ప్రణామము.



# మృత్యుంజయ మంత్రము

**ఓం త్ర్యంబకం యజామహే**
**సుగంధిం పుష్టివర్ధనమ్ ।**
**ఉర్వారుక మివ బంధనాత్**
**మృత్యోర్ముక్షీయ మామృతాత్ ॥**

# శాంతి మంత్రములు

ఓం స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః।
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు!

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్య శాలినీ
దేశోఽయం క్షోభరహితః బ్రాహ్మణా స్స న్తు నిర్భయాః॥



ఓం అసతో మా సద్గమయ!
తమసో మా జ్యోతిర్గమయ!
మృత్యోర్మా అమృతం గమయ!
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం సర్వే భవన్తు సుఖినః సర్వేసన్తు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యన్తు మా కశ్చిత్ దుఃఖ భాగ్భవేత్॥
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం సర్వేషాం స్వస్తిర్భవతు! సర్వేషాం శాంతి ర్భవతు!
సర్వేషాం పూర్ణం భవతు! సర్వేషాం మంగలం భవతు!
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే ॥
ఓం శాంతిః శాంతిః శాంతిః





## దేవీ ప్రాతః స్మరణమ్

కరాగ్రే వసతే లక్ష్మీః కరమూలే సరస్వతీ!।
కర మధ్యేతు గోవిందః ప్రభాతే కరదర్శనం ॥ 1

చేతివేళ్ళ చివర లక్ష్మీదేవి వసిస్తున్నది. మణి బంధము వద్ద శారద శోభిస్తున్నది. అరచేతిలో అచ్యుతుడైన గోవిందుడే ఉన్నాడు. కనుక ప్రభాత సమయాన భక్తితో అరచేతిని దర్శించాలి.

సముద్ర వసనే దేవి పర్వత స్తన మండలే।
విష్ణుపత్ని నమస్తుభ్యం పాద స్పర్శం క్షమస్వ మే! ॥ 2



సప్తసాగరాలను వస్త్రముగా ధరించిన తల్లీ, కుచములే కొండలుగా ధరించి శోభించు జననీ, విష్ణుసతీ - అమ్మా! భూదేవీ! నా పాదాలతో నిన్ను స్పృశిస్తున్నందుకు క్షమించు తల్లీ!

**ప్రాతర్నమామి లలితా చరణారవిందం**
**భక్తేష్టదాన నిరతం భవసింధు పోతమ్।**
**పద్మాస నాది సురనాయక పూజనీయం**
**పద్మాంకుశ ధ్వజ సుదర్శన లాంఛనాఢ్యమ్ ॥**

భక్తుల కోర్కెలను తీర్చుటయందు సదా ఆసక్తి కలిగి సంసార సాగరమును దాటించుటలో దివ్య నౌకయై, బ్రహ్మాది దేవతలచే ఆరాధింప

బడుచు, పద్మము, అంకుశము, ధ్వజము, చక్రము వంటి రేఖలతో కూడుకొని శోభించుచున్న లలితాదేవి చరణ కమలమును ప్రాతఃకాలమున నమస్కరించుచున్నాను.

**ఓం శుక్లాం బ్రహ్మవిచార సారపరమాం ఆద్యాం జగద్వ్యాపినీం**

**వీణా పుస్తక ధారిణీమ్ అభయదాం జాడ్యాంధకారాపహాం।**

**హస్తే స్ఫాటిక మాలికాం విదధతీమ్ పద్మాసనే సంస్థితాం**

**వన్దే తాం పరమేశ్వరీం భగవతీం బుద్ధిప్రదాం శారదామ్॥ 4**

ఉత్కృష్టమైన బ్రహ్మ విచార సారరూపిణి, ఆదిదేవి, యావత్ప్రపంచమంతయు వ్యాపించునది, వీణను, పుస్తకమును హస్తము నందు ధరించిన తల్లి, అభయ ప్రదాయిని, జడత్వమనే తిమిరమును హరించునది, స్ఫటిక



మాలను హస్తమునందు ధరించి, పద్మాసనమున కూర్చొని, దివ్య శ్వేతాంబర ధారిణియై, జ్ఞానప్రదాయినియైన భగవతి శారదామాతకు నమస్కారము.

**నమస్తులసి కళ్యాణి నమో విష్ణుప్రియే శుభే।**

**నమో మోక్షప్రదే దేవి నమః సంపద ప్రదాయిని!॥ 5**

కళ్యాణరూపిణి యైన తులసిమాతకు వందనము. శుభరూపిణి, విష్ణు ప్రియ అయిన తులసిమాతకు వందనము. సంపదను, మోక్ష సంపదను అనుగ్రహించు తులశమ్మకు ప్రణామము.

**లక్ష్మీం క్షీరసముద్ర రాజ తనయాం శ్రీరంగ ధామేశ్వరీం**

**దాసీ భూత సమస్తదేవ వనితాం లోకైక దీపాంకురాం।**

**శ్రీమన్మంద కటాక్ష లబ్ధ విభవ బ్రహ్మేంద్ర గంగాధరాం**
**త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందే ముకుంద ప్రియామ్ ॥6**

పాలకడలి ప్రభు పుత్రిక, శ్రీరంగ పురవాసిని, సమస్త భక్త జనులకు జ్యోతి బీజమైన లక్ష్మీదేవి, తమ క్రీగంటి చూపుతో బ్రహ్మ ఇంద్ర మహేశ్వరులకు వైభవమును ప్రసాదించునది, ముల్లోకములకు జనని, పద్మము నుండి పుట్టినది, ముకుందునికి ప్రియమైన తల్లియైన లక్ష్మీదేవికి ప్రణామము.




పల్లవి :- భవభయ నాశిని! దుష్ట నివారిణి
సంకట నాశిని! పాలయ మాం!
జై భవాని! పాలయ మాం!



**చరణములు :-**

1. మణిమయ భూషిణి! జగదఘ మోచని!
పరిజన పాలని! పర్వత నందిని!
మాయ విదారిణి! మహేశ్వర తోషిణి!
ప్రణవ స్వరూపిణి! అంబ భవాని! ॥భవ॥

2. మానస దాయిని! మంజుల లోచని
శివసతి! భగవతి! పాలయ మాం!
త్రిజగన్మోహిని! త్రిశూలధారిణి
శోకహారిణి! చైతన్యరూపిణి! ॥భవ॥

## దేవి గాయత్రి

కాత్యాయ నాయ విద్మహే

కన్యకుమారి ధీమహి

తన్నో దుర్గిః ప్రచోదయాత్



## శ్రీలక్ష్మ్యష్టకమ్

**నమస్తే஽స్తు మహామాయే శ్రీపీఠే సురపూజితే।**

**శంఖచక్రగదాహస్తే మహాలక్ష్మి నమో஽స్తు తే॥** 1

అమ్మా! మహాలక్ష్మీ! ప్రణామం. శ్రీపీఠవాసినీ! సురపూజితా! శంఖచక్ర గదలను, హస్తముల యందు ధరించి శోభించు జననీ! ప్రణామం.

**నమస్తే గరుడారూఢే కోలాసుర భయంకరి।**

**సర్వపాపహరే దేవి మహాలక్ష్మి నమో஽స్తు తే॥** 2

అమ్మా! మహాలక్ష్మీ! వందనం. గరుత్మంతునిపై ఆసీనమైన తల్లీ! కోలాసురునికి భయరూపిణీ! సమస్త పాపములను హరించు ఆదిలక్ష్మీ! వందనం.

**సర్వజ్ఞే సర్వవరదే సర్వదుష్ట భయంకరి ।**
**సర్వదుఃఖహరే దేవి మహాలక్ష్మి నమోఽస్తు తే ॥ 3**

అమ్మా! మహాలక్ష్మీ! నమస్కారం. నీకు తెలియనిది లేదు. సమస్త వరములను ప్రసాదించు తల్లివి. దుష్టులందరికి భయరూపిణివి. సమస్త దుఃఖములను పోగొట్టు వరలక్ష్మీ! నమస్కారం.

**సిద్ధిబుద్ధిప్రదే దేవి భుక్తి ముక్తి ప్రదాయిని ।**
**మంత్రమూర్తే సదా దేవి మహాలక్ష్మి నమోఽస్తు తే ॥ 4**

అమ్మా! మహాలక్ష్మీ! అభివందనం. సిద్ధిబుద్ధులను మాకు ప్రసాదించు అమ్మవు. భక్తిని ముక్తిని అనుగ్రహించు తల్లివి. మంత్ర స్వరూపిణివి. అమ్మా! శ్రీదేవీ! అభివందనం.



**ఆద్యంతరహితే దేవి ఆద్యశక్తి మహేశ్వరి ।**
**యోగజ్ఞే యోగసంభూతే మహాలక్ష్మి నమోఽస్తు తే ॥ 5**

అమ్మా! మహాలక్ష్మీ! వందనం. ఆద్యంత రహితా! ఆదిశక్తి స్వరూపిణీ! సత్యమయీ! యోగ రూపిణీ! యోగము ద్వారా ప్రాప్తించు తల్లీ! వందనం.

**స్థూల సూక్ష్మ మహారౌద్రే మహాశక్తి మహోదరే ।**
**మహా పాప హరే దేవి మహాలక్ష్మి నమోఽస్తు తే ॥ 6**

అమ్మా! మహాలక్ష్మీ! ప్రణామం. స్థూలమూ నీవే. సూక్ష్మమూ నీవే. గొప్ప రౌద్రమును ప్రదర్శించు మాతవు. గొప్ప శక్తి గల తల్లివి. సర్వమును హరించు అమ్మవు. మహా దురిత సంహారిణివి. లక్ష్మీదేవీ! ప్రణామం.

పద్మాసన స్థితే దేవి పరబ్రహ్మ స్వరూపిణి ।
పరమేశి జగన్మాతః మహాలక్ష్మి నమోఽస్తు తే ॥ 7

అమ్మా! మహాలక్ష్మీ! నమస్కారం. కమలాసనవాసినీ! పరబ్రహ్మ రూపిణీ! పరమాత్మ స్వరూపిణీ! జగన్మాతా! నమస్కారం.

శ్వేతాంబరధరే దేవి నానాలంకార భూషితే ।
జగత్ స్థితే జగన్మాతః మహాలక్ష్మి నమోఽస్తు తే ॥ 8

అమ్మా! మహాలక్ష్మీ! వందనం శ్వేతాంబరధారిణీ! సర్వాలంకార భూషిణీ! వందనం జగత్కారిణీ! జగన్మాతా! వందనం.

ఇతీంద్రకృతం శ్రీమహాలక్ష్మ్యష్టకమ్



## భజన

జయకరి జనేశ్వరి దానేశ్వరి అంబ
భయంకరి అభయంకరి మనోహరి అంబ
ప్రియకరి దయాకరి గుణమంజరి అంబ
సుందరి విజయకరి మోక్షకరి అంబ ॥ జయకరి ॥

# శ్రీ దుర్గాష్టోత్తర శత నామావళిః

1. ఓం దుర్గాయై నమః
2. ఓం శివాయై నమః
3. ఓం మహాలక్ష్మ్యై నమః
4. ఓం మహాగౌర్యై నమః
5. ఓం చండికాయై నమః
6. ఓం సర్వజ్ఞాయై నమః
7. ఓం సర్వలోకేశ్యై నమః
8. ఓం సర్వకర్మఫలప్రదాయై నమః
9. ఓం సర్వతీర్థమయ్యై నమః
10. ఓం పుణ్యాయై నమః
11. ఓం దేవయోనయే నమః
12. ఓం అయోనిజాయై నమః
13. ఓం భూమిజాయై నమః
14. ఓం నిర్గుణాయై నమః
15. ఓం ఆధారశక్త్యై నమః
16. ఓం అనీశ్వర్యై నమః



17. ఓం నిర్గమాయై నమః
18. ఓం నిష్క్రియాయై నమః
19. ఓం సర్వగర్వవిమర్దిన్యై నమః
20. ఓం సర్వలోకప్రియాయై నమః
21. ఓం వాణ్యై నమః
22. ఓం సర్వవిద్యాధిదేవతాయై నమః
23. ఓం పార్వత్యై నమః
24. ఓం దేవమాత్రే నమః
25. ఓం అనీశాయై నమః
26. ఓం వింధ్యవాసిన్యై నమః
27. ఓం తేజోవత్యై నమః
28. ఓం మహామాత్రే నమః
29. ఓం కోటిసూర్యప్రభాయై నమః
30. ఓం దేవతాయై నమః
31. ఓం వహ్నిరూపాయై నమః
32. ఓం సతౌజసై నమః
33. ఓం వర్ణరూపిణ్యై నమః
34. ఓం గుణాశ్రయాయై నమః
35. ఓం గుణమధ్యాయై నమః
36. ఓం గుణత్రయవివర్జితాయై నమః

37. ఓం కర్మజ్ఞానప్రదాయై నమః
38. ఓం కాంతాయై నమః
39. ఓం సర్వసంహారకారిణ్యై నమః
40. ఓం ధర్మజ్ఞానాయై నమః
41. ఓం ధర్మనిష్ఠాయై నమః
42. ఓం సర్వకర్మవివర్జితాయై నమః
43. ఓం కామాక్ష్యై నమః
44. ఓం కామసంహర్త్ర్యై నమః
45. ఓం కామక్రోధవివర్జితాయై నమః
46. ఓం శాంకర్యై నమః
47. ఓం శాంభవ్యై నమః
48. ఓం శాంతాయై నమః
49. ఓం చంద్రసూర్యాగ్నిలోచనాయై నమః
50. ఓం సుజయాయై నమః
51. ఓం జయభూమిష్ఠాయై నమః
52. ఓం జాహ్నవ్యై నమః
53. ఓం జనపూజితాయై నమః
54. ఓం శాస్త్రాయై నమః
55. ఓం శాస్త్రమయ్యై నమః
56. ఓం నిత్యాయై నమః



57. ఓం శుభాయై నమః
58. ఓం చంద్రార్ధమస్తకాయై నమః
59. ఓం భారత్యై నమః
60. ఓం భ్రామర్యై నమః
61. ఓం కల్పాయై నమః
62. ఓం కరాళ్యై నమః
63. ఓం కృష్ణపింగళాయై నమః
64. ఓం బ్రాహ్మ్యై నమః
65. ఓం నారాయణ్యై నమః
66. ఓం రౌద్ర్యై నమః
67. ఓం చంద్రామృతపరిస్రుతాయై నమః
68. ఓం జ్యేష్ఠాయై నమః
69. ఓం ఇందిరాయై నమః
70. ఓం మహామాయాయై నమః
71. ఓం జగత్సృష్ట్యధికారిణ్యై నమః
72. ఓం బ్రహ్మాండకోటిసంస్థాయై నమః
73. ఓం కామిన్యై నమః
74. ఓం కమలాలయాయై నమః
75. ఓం కాత్యాయన్యై నమః
76. ఓం కలాతీతాయై నమః

77. ఓం కాలసంహారకారిణ్యై నమః
78. ఓం యోగనిష్ఠాయై నమః
79. ఓం యోగిగమ్యాయై నమః
80. ఓం యోగిధ్యేయాయై నమః
81. ఓం తపస్విన్యై నమః
82. ఓం జ్ఞానరూపాయై నమః
83. ఓం నిరాకారాయై నమః
84. ఓం భక్తాభీష్టఫలప్రదాయై నమః
85. ఓం భూతాత్మికాయై నమః
86. ఓం భూతమాత్రే నమః
87. ఓం భూతేశ్యై నమః
88. ఓం భూతధారిణ్యై నమః
89. ఓం స్వధానారీమధ్యగతాయై నమః
90. ఓం షడాధారాదివర్ధిన్యై నమః
91. ఓం మోహితాయై నమః
92. ఓం అంశుభవాయై నమః
93. ఓం శుభ్రాయై నమః
94. ఓం సూక్ష్మాయై నమః



95. ఓం మాత్రాయై నమః
96. ఓం నిరాలసాయై నమః
97. ఓం నిమగ్నాయై నమః
98. ఓం నీలసంకాశాయై నమః
99. ఓం నిత్యానందిన్యై నమః
100. ఓం హరాయై నమః
101. ఓం పరాయై నమః
102. ఓం సర్వజ్ఞానప్రదాయై నమః
103. ఓం అనంతాయై నమః
104. ఓం సత్యాయై నమః
105. ఓం దుర్లభరూపిణ్యై నమః
106. ఓం సరస్వత్యై నమః
107. ఓం సర్వగతాయై నమః
108. ఓం సర్వాభీష్టప్రదాయై నమః

ఇతి శ్రీదుర్గాష్టోత్తరశత నామావళిః

# ప్రవచనం

సృష్టికి పరమాత్మ నిమిత్తకారణమని చెప్పినపుడు "సః" - అతడు అంటాము. ఉపాదాన కారణముగా నిర్వచించినపుడు "సా"-ఆమె అంటాము.

ఈ రెండూగాక అధిష్ఠాన పరబ్రహ్మముగా నిర్దేశించినపుడు "తత్" - అది అంటాము. పరమాత్మ జగత్తుకు ఉపాదాన కారణం అనగానే జగన్మాత మనస్సులో స్ఫురిస్తుంది. ఆ జగన్మాత స్వరూపమే ముగ్గురమ్మలుగా దర్శనమిచ్చి ముముక్షువులను తరింపచేస్తుంది.

ముందు దుర్గపూజ.



దురితములను పోగొట్టు తల్లి దుర్గాదేవి. పాపాలు నిండిన మనస్సుతో భక్తి చేయడం సాధ్యం కాదు. కనుకనే.

**ధాత్రీం సమస్త జగతాం**

**దురితాప హన్త్రీం**

సమస్త పాపములను పోగొట్టి యావత్ప్రపంచమును పాలించు తల్లిగ దుర్గాదేవిని ఆరాధిస్తాము.

దుర్గుణాలు దూరమయ్యాయని తృప్తి చెంది ఊరుకోకూడదు. ఆత్మ విద్యను గ్రహించేందుకు విశుద్ధమైన, ప్రసన్నమైన అంతః కరణమును పొందాలి. ఇదే లక్ష్మీపూజ.

**సర్వజ్ఞే సర్వవరదే**

**సర్వదుఃఖహరే దేవి** - సర్వమును తెలిసిన తల్లిగ, సమస్త వరములను ప్రసాదించు జననిగా సర్వదుఃఖములను నశింపచేయు అమ్మగా లక్ష్మీదేవిని ప్రార్థిస్తాము.

దుర్గపూజ ఫలితంగా పాపాలు నశిస్తాయి. లక్ష్మీపూజ వలన అంతఃకరణ శుద్ధి లభిస్తుంది. ఆ తరువాత ఆత్మజ్ఞానమును పొందాలి. ఇదే సరస్వతీపూజ.

**కటాక్షే దయార్ద్రాం**
**కరే జ్ఞానముద్రాం**

దయార్ద్రమగు కటాక్షము గల తల్లిగ, చేతియందు జ్ఞానముద్రను ధరించు స్వాత్మ స్వరూపిణిగా సరస్వతీదేవిని ఆరాధిస్తాము.



ఇది అమ్మల విషయంలో మన కుండవలసిన అవగాహన.

శక్తి అంటే బలము. అందరికీ శక్తి, అందరిలోని శక్తి అమ్మయే. జగజ్జననియే. పరమాత్మ స్వరూపమును అమ్మగా అర్చించడం ఆరాధించడం ఒక్క భారతీయ సంస్కృతికే దక్కింది.

ఎత్తు ఎదిగే వరకు పొత్తు కుదిరే వరకు "అమ్మా! ఎత్తుకో" అని మొత్తుకోవడమే బిడ్డపని.

అదే ప్రార్థనల రూపంలో మన ముందున్న పని.

# శ్రీ శారదా భుజంగ ప్రయాతాష్టకమ్

సువక్షోజ కుంభాం సుధాపూర్ణ కుంభాం
ప్రసాదావలంబాం ప్రపుణ్యావలంబామ్।
సదాస్యేందుబింబాం సదానోష్ఠ బింబాం
భజే శారదాంబా మజస్రం మదంబామ్॥ 1

అందమైన వక్షోజములు కలది, అమృత కలశమును ధరించునది, దయాస్వరూపిణి, గొప్ప పుణ్యమువలన ప్రాప్తించునది, చంద్రబింబము వంటి మోముతో ప్రకాశిస్తూ అనుగ్రహించినట్లు పలికే బింబాధరముతో శోభించు మా తల్లి శారదమ్మను సదా భజింతును.



కటాక్షే దయార్ద్రాం కరే జ్ఞానముద్రాం
కలాభి ర్వినిద్రాం కలాపై స్సుభద్రామ్।
పురస్త్రీం వినిద్రాం పురస్తుంగ భద్రాం
భజే శారదాంబా మజస్రం మదంబామ్॥ 2

క్రీగంటి చూపులో దయ, చేతియందు జ్ఞానముద్ర, ఏమరుపాటు లేని కళావైభవం, సర్వాలంకార నిలయం, సదా పురస్త్రీ జాగరణ, మహోన్నత శుభాలను ముందే ప్రసాదించు మా తల్లి, శారదమ్మను సదా భజింతును.

లలామాంక ఫాలాం లసద్గానలోలాం
స్వభక్తైక పాలాం యశః శ్రీకపోలామ్।

**కరే త్వక్షమాలాం కనత్ప్రత్నలోలాం**
**భజే శారదాంబా మజస్రం మదంబామ్ ॥ 3**

మనోజ్ఞమైన నుదుటి కుంకుమ, గానప్రియయై తనను కీర్తించు భక్తులను పాలించుట, కీర్తికి, సంపదకు నిలయమై, జపమాలను ధరించి, ప్రకాశించు రత్నమాలలు గల మా తల్లి శారదమ్మను సదా భజింతును.

**సుసీమంత వేణీం దృశా నిర్జితైణీం**
**రమత్కీర వాణీం నమ ద్వజ్రపాణిమ్ ।**
**సుధా మందరాస్యాం ముదాచింత్య వేణీం**
**భజే శారదాంబా మజస్రం మదంబామ్ ॥ 4**



చక్కని పాపటతో శోభించు జడ, లేడి చూపులను మించిన చూపులు, చిలుక పలుకులు, ఇంద్రుని వందన స్వీకారము, చంద్రవదన శోభ, చింతించుటకు వీలుగాని వైభవము గల మా తల్లి శారదమ్మను సదా నేను భజింతును.

**సుశాంతాం సుదేహాం దృగంతేక చాంతాం**
**లసత్సల్లతాంగీ మనంతామ చింత్యామ్ ।**
**స్మృతాం తాపసైః సర్గ పూర్వస్థితాం తాం**
**భజే శారదాంబా మజస్రం మదంబామ్ ॥ 5**

శాంతి స్వరూపిణి, చక్కని శరీరము కలది, కనుబొమ్మలపై వ్రేలాడు ముంగురులు కలది, ప్రకాశించు తీగవంటి సుకుమార దేహము కలది,

అనంత రూపములతో శోభించునది, ఊహింప నలవికానిదై, తపోధనుల స్మృతులలో విహరించుచు, సృష్ట్యాది యందే శోభించిన మా తల్లి శారదమ్మను సదా నేను భజింతును.

**కురంగే తురంగే మృగేంద్రే ఖగేంద్రే**
**మరాలే మదేభే మహోక్షేధి రూఢామ్ ।**
**మహత్యాం నవమ్యాం సదా సామరూపాం**
**భజే శారదాంబా మజస్రం మదంబామ్ ॥** 6

సదా సామవేద రూపిణిగా శోభించుచు, లేడిని, గుఱ్ఱమును, సింహమును, గరుత్మంతుని, హంసను, మదపుటేనుగును, వృషభమును అధిరోహించి, నానా రూపములతో భాసించు మా తల్లి శారదమ్మను సదా భజింతును



**జ్వల త్కాంతి వహ్నిం జగన్మోహ నాంగీం**
**భజ న్మానసాం భోజ సుభ్రాంత భృంగీమ్ ।**
**నిజస్తోత్ర సంగీత నృత్య ప్రభాంగీం**
**భజే శారదాంబా మజస్రం మదంబామ్॥** 7

ప్రజ్వలించు అగ్నివలె ప్రకాశించునది, జగన్మోహనమగు దేహ శోభకలది, భక్తుల హృదయ కమలమున భ్రమరము స్తోత్ర, సంగీత నృత్య ప్రసంగముల యందు ఆసక్తి గల మా తల్లి శారదమ్మను సదా భజింతును.

**భవాంభోజ నేత్రాజ సంపూజ్యమానాం**
**లసన్మందహాస ప్రభావక్త్ర చిహ్నామ్ ।**

**చలచ్చంచలా చారు తాటంక కర్ణాం**

**భజే శారదాంబా మజస్రం మదంబామ్॥ 8**

త్రిమూర్తులచేత సంపూజ్యురాలు, అందమైన మందహాసముతో శోభించు ముఖ కమలము గలది, మెరుపువలె ప్రకాశించు కమ్మలు కలది అయిన మా తల్లి శారదమ్మను సదా భజింతును.

శ్రీ మచ్ఛంకర భగవత్పూజ్యపాద విరచిత

శ్రీ శారదా భుజంగ ప్రయాతాష్టకమ్ సంపూర్ణం



# మృత్యుంజయ మంత్రము

**ఓం త్ర్యంబకం యజామహే**

**సుగంధిం పుష్టి వర్ధనమ్**

**ఉర్వారుక మివ బంధనాత్**

**మృత్యోర్ముక్షీయ మామృతాత్**

# శాంతిమంత్రములు

ఓం స్వస్తి ప్రజాభ్య ః పరిపాలయన్తాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః
గో బ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు!

కాలే వర్షతు పర్జన్యః
పృథివీ సస్య శాలినీ
దేశోఽయం క్షోభరహితః
బ్రాహ్మణా స్సన్తు నిర్భయాః ॥



ఓం అసతో మా సద్గమయ!
తమసో మా జ్యోతిర్గమయ!
మృత్యోర్మా అమృతం గమయ!
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం సర్వే భవన్తు సుఖినః సర్వేసన్తు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యన్తు మా కశ్చిత్ దుఃఖ భాగ్భవేత్
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం సర్వేషాం స్వస్తిర్భవతు! సర్వేషాం శాంతిర్భవతు!
సర్వేషాం పూర్ణం భవతు! సర్వేషాం మంగలం భవతు!
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే ॥
ఓం శాంతిః శాంతిః శాంతిః



# శనిలో మంచి



# ప్రాతః స్మరణమ్

**ప్రాతః స్మరామి రఘునాథ ముఖారవిందం**

**మందస్మితం మధురభాషి విశాల ఫాలమ్ ।**

**కర్ణావలంబి చలకుండల శోభిగండం**

**కర్ణాంత దీర్ఘనయనం నయనాభిరామమ్ ॥ 1**

మందహాసమును చిందించునది, తియ్యని పలుకులను కలది, విశాలమైన నుదురు కలది, కుండలములచే శోభించు వీనులు కలది, ప్రకాశవంతమైన చెక్కిళ్ళు కలది, విశాలమగు నేత్రములు కలది, నేత్రానందమును



ప్రసాదించునది అగు శ్రీరామచంద్రుని ముఖకమలమును ప్రాతఃకాలమున స్మరించుచున్నాను.

**ప్రాతః స్మరామి దధిఘోష వినీత నిద్రం**

**నిద్రావ సాన రమణీయ ముఖారవిందమ్ ।**

**హృద్యానవద్య వపుషం నయనాభిరామం**

**ఉన్నిద్ర పద్మనయనం నవనీత చోరమ్ ॥ 2**

పెరుగు చిలుకు చప్పుళ్ళకు నిద్ర లేచి, ఆ నిదుర మబ్బులో మొగము మరింత అందమై, పద్మసౌందర్యముతో శోభించగా, మనోజ్ఞమై, నిర్దోషమైన శరీరముకలవాడు, కన్నులకు మనోహరంగా గోచరించువాడు, వికసించిన

కమలదళనేత్రుడు అగు వెన్నదొంగ శ్రీకృష్ణుని ప్రాతః కాలమున స్మరించుచున్నాను.

## కేశవ నామాలతో మేలుకొలుపు

1. కేశవ యనినిన్ను నోరార భక్తులు
   కీర్తించుచున్నారు మేలుకో !
   దేవకి నందన దానవ భంజన
   వందన మిదె స్వామి మేలుకో!...... కృష్ణా , ఏలుకో.......



2. నారాయణా! నరులు కరములు జోడించి
   వరము లంటున్నారుమేలుకో!
   వైకుంఠ మాధవ! గోకుల యాదవ
   నారద సన్నుత మేలుకో!....... కృష్ణా , ఏలుకో.....

3. మాధవ యని నిన్ను మహితాత్ములందరు
   స్తుతియించు చున్నారు మేలుకో!
   మాయలు మసి చేసి మహిమను దర్శింప
   గరుడ గమన! వేగ మేలుకో!..... కృష్ణా, ఏలుకో.....

4. గోవింద యని నిన్ను ఆనందముగ మేము
అర్చించు చున్నాము మేలుకో!
గోపాల బాలక! గోపీ జనప్రియ!
గోవర్ధనోద్ధార! మేలుకో!..... కృష్ణా , ఏలుకో.....

5. విష్ణుదేవుడ! నీవు వైకుంఠమును వీడి
మా ఇంట కొలువుండ మేలుకో!
సిరులు లేవు మాకు సురులు కాము మేము
వరములు కోరము మేలుకో!.... కృష్ణా , ఏలుకో.....

6. మధుసూదన! అంటూ మంచి తెలిసిన మనసు
మారాము చేస్తోంది మేలుకో!



చిరునవ్వు లొలుకుచు వెన్నెలలు చిందించే
మా జీవన జాబిల్లి మేలుకో!..... కృష్ణా, ఏలుకో.....

7. త్రివిక్రమా! ఇది ఏమి పరాక్రమము?
ఆక్రోశ మెందుకు? మేలుకో!
సక్రమ మార్గాన మమ్ముల నడుపుటకు
చక్రధారి! వేగ మేలుకో!.... కృష్ణా , ఏలుకో.....

8. వామన! మన తన వదలిన మాపైన
కరుణను వర్షింప మేలుకో!
ముని జన వందిత వసుదేవ నందన
మురళీ మనోహర మేలుకో!... కృష్ణా , ఏలుకో.....

9. శ్రీధర! సుకుమార! ఇకనైన మేలుకోరా!
అపవాదు లెందుకు మేలుకో!
ఇలలో శ్రీపతులెల్ల కలలోనే ఉంటారు
జగమెరిగిన నా స్వామి మేలుకో!.... కృష్ణా , ఏలుకో.....

10. హృషీకేశ! నిన్ను వర్ణించుటకు మాకు
భాషలేదు తండ్రీ! మేలుకో!
ఋషి బిడ్డలము మేము దోషము లెరుగము
పోషించుటకు మమ్ము మేలుకో!..... కృష్ణా , ఏలుకో.....



11. పద్మనాభ! పది కాలాల భక్తిని
పట్టించుటకు మాకు మేలుకో!
వట్టి చేతులతోనే మూరేసే వారము
గట్టి జ్ఞానము నివ్వ మేలుకో!.... కృష్ణా , ఏలుకో.....

12. దామోదరా! దేవ దానవుల నడుమ
మగువై కులికిన స్వామి మేలుకో!
మంచి చెడుల మధ్య మునుగుచు నున్నాము
మమ్ముద్ధరించుటకు మేలుకో!... కృష్ణా , ఏలుకో.....

13. సంకర్షణ! మాకు సంఘర్షణే గాని
సంతృప్తి తెలియదు మేలుకో!
సంతస మొసగేటి చల్లని నా స్వామి
పంత మేల? దేవా! మేలుకో!...... కృష్ణా , ఏలుకో.....

14. వాసుదేవా! మాలో వసియింపగ రావా!
వాస్తవ మును తెలుప మేలుకో!
వలపులరాయడ! వసుమతి వల్లభ!
వాగ్దేవి సన్నుత మేలుకో!..... కృష్ణా, ఏలుకో.....



15. ప్రద్యుమ్న! యని నీ పావన చరితము
పఠియించు చున్నాము మేలుకో!
దధి చిలికే వేళాయె దొరతనము నీదాయె
దొంతరలు దించుటకు మేలుకో!.... కృష్ణా , ఏలుకో.....

16. అనిరుద్ధ! మా వద్ద భక్తి ఒక్కటె గాని
సిరిసంపదలు లేవు మేలుకో!
వరించితిమి నిన్ను, తరియింప జేయవా
సిరిగల దేవుడ మేలుకో!.... కృష్ణా , ఏలుకో.....

17. పురుషోత్తమ! నీవు వేషములు మానేసి
తోషము లొలికింప మేలుకో!
అన్నెము పున్నెము నెరుగని వారము
ఉన్నాము నీ కొరకు మేలుకో!.... కృష్ణా , ఏలుకో.....

18. అధోక్షజ! నిన్ను వీక్షించలేని మా
అక్షిని సరిజేయ మేలుకో!
పద్మనిభేక్షణ మాది నిరీక్షణ
క్షణమైన మరువము మేలుకో!.... కృష్ణా , ఏలుకో.....



19. నారసింహా! నీ ప్రేమ అపారము
మేము నీ వారము మేలుకో
ఓంకార దేవుడ! ఘీంకార రూపుని
గట్టెక్కించితి వయ్యా, మేలుకో!.... కృష్ణా , ఏలుకో.....

20. అచ్యుత! ఆనంద! దివ్య పరమానంద!
అర్కుడొస్తున్నాడు మేలుకో!
మిత్రవంశ తిలక! సుగ్రీవ ప్రియ మిత్ర ....రామా మేలుకో!
రవి చంద్రవర నేత్ర, మేలుకో!.... ....కృష్ణా, ఏలుకో....

21. జనార్దన! నీవే జీవనము మాకంటూ
జనులు మూగున్నారు మేలుకో!
జన కళ్యాణము చేయ జాగేల నా స్వామి
జగ న్నివాసుడ మేలుకో!... కృష్ణా , ఏలుకో.....

22. ఉపేంద్ర! నీ కొరకు నిరుపేద లందరు
నింగి చూస్తున్నారు మేలుకో!
సిరిలేని వారిని పురిపెట్టు చున్నారు
కరి వరద! సరి జేయ మేలుకో!.... కృష్ణా , ఏలుకో.....



23. హరి! యను వారినే సిరి కనికరించును
మరి మరి పిలిచెద మేలుకో!
చేరి భజించెద జారిన బ్రతుకును
దరి జేర్చుటకు నీవు మేలుకో!.... కృష్ణా , ఏలుకో.....

24. శ్రీకృష్ణ! అనగానే తృష్ణను హరియించు
సుతపుని తనయుడ మేలుకో!
విష్ణుదేవుడ వయ్య వాసుదేవ స్వామి
వర్ణించలేమయ్యా! మేలుకో!.... కృష్ణా , ఏలుకో.....

మందహాసము చిందే నందకిశోరుడ!
చైతన్యాశ్రమ వాసి మేలుకో!
పండిన ప్రేమతో నిండిన గుండెలలో
గుడి కట్టుకున్నారు మేలుకో!
మునులై సేవిస్తున్నారు ఏలుకో!.....

కల్ల కపటములు లేని చైతన్యుని కలములో
బలము నీవైతివి మేలుకో!
గళకలము లేకమై మాటలు ఒలికింప
మహి పులకరించింది మేలుకో... కృష్ణా , ఏలుకో.....



కేశవ నామాల మేలు కొలుపులు పాడ
ఆశలు తొలగును మేలుకో
పాశములు త్రెంచేటి కేశవుని కృపకలుగు
సిద్ధించు కైవల్యం మేలుకో!.... కృష్ణా , ఏలుకో.....

## కృష్ణ గాయత్రి

గోవిందాయ విద్మహే
గోపీజన వల్లభాయ ధీమహి
తన్నో కృష్ణః ప్రచోదయాత్

## రామ గాయత్రి

దాశరథాయ విద్మహే
సీతా వల్లభాయ ధీమహి
తన్నో రామచంద్రః ప్రచోదయాత్

## విష్ణు గాయత్రి

నారాయణాయ విద్మహే
వాసుదేవాయ ధీమహి
తన్నో విష్ణుః ప్రచోదయాత్



## శ్రీకృష్ణాష్టకం

వసుదేవసుతం దేవం కంస చాణూర మర్దనం ।
దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుం ॥ 1

అతసీ పుష్పసంకాశం హారనూపుర శోభితం ।
రత్నకంకణ కేయూరం కృష్ణం వందే జగద్గురుం ॥ 2

కుటిలాలక సంయుక్తం పూర్ణచంద్రనిభాననం ।
విలసత్కుండల ధరం కృష్ణం వందే జగద్గురుం ॥ 3

మందార గన్ధ సంయుక్తం చారుహాసం చతుర్భుజం।
బర్హిపిఞ్ఛావ చూడాంగం కృష్ణం వందే జగద్గురుం॥ 4

ఉత్ఫుల్ల పద్మపత్రాక్షం నీలజీమూత సన్నిభమ్।
యాదవానాం శిరోరత్నం కృష్ణం వందే జగద్గురుం॥ 5

రుక్మిణీకేళి సంయుక్తం పీతాంబర సుశోభితం।
అవాప్త తులసీగంధం కృష్ణం వందే జగద్గురుం॥ 6

గోపికానాం కుచద్వన్ద్వ కుంకుమాంకిత వక్షసం।
శ్రీనికేతం మహేష్వాసం కృష్ణం వందే జగద్గురుం॥ 7



శ్రీవత్సాంకం మహోరస్కం వనమాలావిరాజితం।
శంఖచక్రధరం దేవం కృష్ణం వందే జగద్గురుం॥ 8

కృష్ణాష్టక మిదం పుణ్యం ప్రాతురుత్థాయ యః పఠేత్
కోటిజన్మ కృతం పాపం స్మరణేన వినశ్యతి॥

శ్రీకృష్ణాష్టకం సంపూర్ణమ్

# శ్రీకృష్ణాష్టోత్తర శతనామావళిః

1. ఓం శ్రీకృష్ణాయ నమః
2. ఓం కమలానాథాయ నమః
3. ఓం వాసుదేవాయ నమః
4. ఓం సనాతనాయ నమః
5. ఓం వసుదేవాత్మజాయ నమః
6. ఓం పుణ్యాయ నమః
7. ఓం లీలామానుష విగ్రహాయ నమః
8. ఓం శ్రీవత్సకౌస్తుభధరాయ నమః
9. ఓం యశోదావత్సలాయ నమః
10. ఓం హరయే నమః
11. ఓం చతుర్భుజాత్తచక్రాసిగదా శంఖాంబుజాయుధాయ నమః
12. ఓం దేవకీనందనాయ నమః
13. ఓం శ్రీశాయ నమః



14. ఓం నందగోపప్రియాత్మజాయ నమః
15. ఓం యమునావేగసంహారిణే నమః
16. ఓం బలభద్రప్రియానుజాయ నమః
17. ఓం పూతనాజీవితహరణాయ నమః
18. ఓం శకటాసురభంజనాయ నమః
19. ఓం నందవ్రజజనానందినే నమః
20. ఓం సచ్చిదానందవిగ్రహాయ నమః
21. ఓం నవనీతవిలిప్తాంగాయ నమః
22. ఓం నవనీతనటాయ నమః
23. ఓం అనఘాయ నమః
24. ఓం నవనీతనవాహారాయ నమః
25. ఓం ముచికుందప్రసాదకాయ నమః
26. ఓం షోడశస్త్రీసహస్రేశాయ నమః
27. ఓం త్రిభంగినే నమః
28. ఓం మధురాకృతయే నమః
29. ఓం శుకవాగమృతాబ్ధీందవే నమః
30. ఓం గోవిందాయ నమః
31. ఓం యోగినాం పతయే నమః

32. ఓం వత్సవాటచరాయ నమః
33. ఓం అనంతాయ నమః
34. ఓం ధేనుకాసురభంజనాయ నమః
35. ఓం తృణీకృతతృణావర్తాయ నమః
36. ఓం యమళార్జునభంజనాయ నమః
37. ఓం ఉత్తాలతాలభేత్రే నమః
38. ఓం తమాలశ్యామలాకృతయే నమః
39. ఓం గోపగోపీశ్వరాయ నమః
40. ఓం యోగినే నమః
41. ఓం కోటిసూర్యసమప్రభాయ నమః
42. ఓం ఇలాపతయే నమః
43. ఓం పరంజ్యోతిషే నమః
44. ఓం యాదవేంద్రాయ నమః
45. ఓం యదూద్వహాయ నమః
46. ఓం వనమాలినే నమః
47. ఓం పీతవాససేనమః
48. ఓం పారిజాతాపహారకాయ నమః
49. ఓం గోవర్ధనాచలోద్ధర్త్రే నమః



50. ఓం గోపాలాయ నమః
51. ఓం సర్వపాలకాయ నమః
52. ఓం అజాయ నమః
53. ఓం నిరంజనాయ నమః
54. ఓం కామజనకాయ నమః
55. ఓం కంజలోచనాయ నమః
56. ఓం మధుఘ్నే నమః
57. ఓం మధురానాథాయ నమః
58. ఓం ద్వారకానాయకాయ నమః
59. ఓం బలినే నమః
60. ఓం బృందావనాంత సంచారిణే నమః
61. ఓం తులసీదామభూషణాయ నమః
62. ఓం శ్యమంతమణేర్హర్త్రే నమః
63. ఓం నరనారాయణాత్మకాయ నమః
64. ఓం కుబ్జాకృష్ణాంబరధరాయ నమః
65. ఓం మాయినే నమః
66. ఓం పరమపురుషాయ నమః

67. ఓం ముష్టికాసురచాణూర మల్లయుద్ధ విశారదాయ నమః
68. ఓం సంసారవైరిణే నమః
69. ఓం కంసారయే నమః
70. ఓం మురారయే నమః
71. ఓం నారకాంతకాయ నమః
72. ఓం అనాదిబ్రహ్మచారిణే నమః
73. ఓం కృష్ణావ్యసనకర్శకాయ నమః
74. ఓం శిశుపాలశిరచ్ఛేత్రే నమః
75. ఓం దుర్యోధనకులాంతకాయనమః
76. ఓం విదురాక్రూరవరదాయ నమః
77. ఓం విశ్వరూపప్రదర్శకాయ నమః
78. ఓం సత్యవాచే నమః
79. ఓం సత్యసంకల్పాయ నమః
80. ఓం సత్యభామారతాయ నమః
81. ఓం జయినే నమః
82. ఓం సుభద్రాపూర్వజాయ నమః
83. ఓం విష్ణవే నమః



84. ఓం భీష్మముక్తిప్రదాయకాయ నమః
85. ఓం జగద్గురవే నమః
86. ఓం జగన్నాథాయ నమః
87. ఓం వేణునాదవిశారదాయ నమః
88. ఓం వృషభాసురవిధ్వంసినే నమః
89. ఓం బాణాసురకరాంతకాయ నమః
90. ఓం యుధిష్ఠిరప్రతిష్ఠాత్రే నమః
91. ఓం బర్హిబర్హావతంసకాయ నమః
92. ఓం పార్థసారథయే నమః
93. ఓం అవ్యక్తాయ నమః
94. ఓం గీతామృతమహోదధయే నమః
95. ఓం కాళీయఫణిమాణిక్యరంజిత శ్రీపదాంబుజాయ నమః
96. ఓం దామోదరాయ నమః
97. ఓం యజ్ఞభోక్త్రే నమః
98. ఓం దానవేంద్రవినాశకాయ నమః
99. ఓం నారాయణాయ నమః
100. ఓం పరస్మై బ్రహ్మణే నమః

101. ఓం పన్నగాశనవాహనాయ నమః
102. ఓం జలక్రీడాసమాసక్తగోపీ వస్త్రాపహారకాయ నమః
103. ఓం పుణ్యశ్లోకాయ నమః
104. ఓం తీర్థపాదాయ నమః
105. ఓం వేదవేద్యాయ నమః
106. ఓం దయానిధయే నమః
107. ఓం సర్వతీర్థాత్మకాయ నమః
108. ఓం సర్వగ్రహరూపీ పరాత్పరాయ నమః

ఇతి శ్రీకృష్ణాష్టోత్తర శతనామావళిః



# ప్రవచనం

అవి వైకుంఠవాకిళ్ళు. వ్యాస వాల్మీకాదులు వైభవోపేతంగా కవితా రంగవల్లులతో అలంకరించిన అసమాన అద్భుత వాకిళ్ళు.

సనక సనందన నారద సనత్కుమారాది మహర్షులు పారాడిన, దోగాడిన దివ్యవాకిళ్ళు.

కడగండ్లను తొలగించి అనుగ్రహ వడగళ్ళను వర్షించే వాకిళ్ళు.

జ్ఞానరతనాలను కురిపించే వాకిళ్ళు. బాధల్ని శాశ్వతంగా మరిపించే వాకిళ్ళు.

వైకల్యాలను తొలగించి వైభవాలను ఆరబోసే వైకుంఠ వాకిళ్ళ వద్దకు మనమూ పోదాం. ఆ దారిన పడిపోదాం. వైకుంఠుని సన్నిధికి చేరిపోదాం. నిత్యమంగళాలైన సుప్రభాతాలతో శిథిల బ్రతుకులను మధుర ప్రభాతాలుగా మార్చుకుందాం. తరించే విధంగా తీర్చుకుందాం.

రాముడు శరణాగత వత్సలుడు. ఆ దివ్యాత్ముని ఆశ్రయించిన రాయి, రప్ప, కప్ప, తిప్ప, కోతి, నాతి, నిప్పు, నీరు - అందరూ తరించారు. అన్నీ తరించాయి.

శ్రీకృష్ణుడు ప్రేమమయుడు. శాంతి రూపుడు.



మువ్వల చిన్ని చరణాలతో కులుకుతూ ముద్దుముద్దుగా వెన్న ముద్దలను దొంగిలించిన మోహన గోపాలుని మధుమయ హృదయం రసమయం. సమరసమయం.

వేదనలో నివేదన ఉందని, నివేదనలో నీ వేదన ఉండాలని, మూత పడేనాడు దాచుకున్నవి దొరికుండవని, దాగుడు మూతల క్రీడలలో చిక్కని గోవిందుడు వెలిబుచ్చిన చక్కని సందేశం యోగమయం. మహోత్యాగమయం. కిరీటి రథమెక్కి ఉభయసేనల రణగొణ ధ్వనుల మధ్య కులుకుల కృష్ణుడు వేద తళుకుల శోభతో ప్రవచించిన పలుకులు జ్ఞానమయం. విజ్ఞానమయం.

ఆ అమృత హృదయుని, రాసవిభుని ఆశ్రయించిన పవిత్రాత్ముల జీవితాలు కూడా అమృతమయమయ్యాయి. రస స్వరూపాలై శోభించాయి.

మోహన గోపాలుని బాటలో మన బ్రతుకులను కూడా మనోహరంగా మార్చుకుందాం. తీర్చుకుందాం.

మురళిలా మనమూ ఖాళీ అవుదాం. శ్రీకృష్ణుని ప్రేమ సమీరంతో నిండిపోదాం.

ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ
ఓం నమో భగవతే వాసుదేవాయ



## భజన

కృష్ణా ముకుందా హరే - గోవింద కృష్ణా ముకుందా హరే
కేశవ మాధవ గోవింద హరే - నందానంద ముకుంద హరే ॥కృష్ణా॥

వామన శ్రీధర అచ్యుత గిరిధర
మురళీధర సుకుమార శరీర
సుజన జీవన హరే జనార్దన
సుందర వదన వందిత చరణ ॥కృష్ణా॥

# మృత్యుంజయ మంత్రము

ఓం త్ర్యంబకం యజామహే
సుగంధిం పుష్టివర్ధనమ్ ।
ఉర్వారుక మివ బంధనాత్
మృత్యోర్ముక్షీయ మామృతాత్ ॥

# శాంతి మంత్రములు

ఓం స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాః ।



గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు!

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్య శాలినీ
దేశోఽయం క్షోభరహితః బ్రాహ్మణా స్స న్తు నిర్భయాః ॥
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం అసతో మా సద్గమయ!
తమసో మా జ్యోతిర్గమయ!
మృత్యోర్మా అమృతం గమయ!
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం సర్వే భవన్తు సుఖినః సర్వేసన్తు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యన్తు మా కశ్చిత్ దుఃఖ భాగ్భవేత్ ॥
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం సర్వేషాం స్వస్తిర్భవతు! సర్వేషాం శాంతి ర్భవతు!
సర్వేషాం పూర్ణం భవతు! సర్వేషాం మంగలం భవతు!
ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే ॥
ఓం శాంతిః శాంతిః శాంతిః